శ్రీరస్తు.

# భగవద్గీతలు

వీనికి
ఇంద్రకంటి వేంకటశాస్త్రులుగారిచే
తెలుగున ద్విపదకావ్యముగా
రచియింపఁబడిన

# హరిసూక్తి తరంగిణి

గ్రంథస్వాతంత్ర్య మొందిన
విన్నకోట అప్పలనరసింహులు గారిచే
స్వకీయ మగు
శ్రీశారదాముకుటముద్రాక్షరశాలలో
ముద్రింపింపఁబడి
ప్రకటింపఁబడియె.

కాపీ రైటు చేయబడినది.

VIZAGAPATAM:
Printed by A. VENKATAREDDI, at the S.S.M. Press.
1897.

శ్రీరస్తు.

# ఉపోద్ఘాతము.

శ్రీమన్నారాయణుండాత్మీయ మాయా విలాసోల్లాసంబున కల్పితానల్ప లోకానీక త్రాణ పరాయణుండై దుశ్శీల నరపాలరూపాసురవ్రాత సంజాతాపార భూభార పరిహారంబునకై స్వాంశంబున శ్రీకృష్ణ వాసుదేవమూర్తి రూపంబున నవనిపై నవతరించి కురుపాండవ భండనంబునం బురందర నందను నరదంబునకు సారథ్యం బాచరించుచుండ, గాండీవధరుండు దయాబంధురుండై స్వబంధుమారణంబునకు రణంబొనర్ప సమ్మతింపక యుమ్మలింపందొడంగిన కవ్వడిని నిమిత్తమాత్రం బాచరించి లోకోపకారకంబుగ నాతని చేత శ్శోకమోహంబుల నపనయించు నెపంబున నిరవద్య విద్యాసామర్థ్యంబున స్వానుభవవేద్యంబగు నిర్విశేష చిన్మాత్రాద్వితీయపరబ్రహ్మ తత్త్వంబు నతిగూఢభావబోధక సా

ధుతర మాధురీధురీణంబులైన ప్రచుర వచన రచనలం బ్రవచించి యయ్యర్జునుని కయ్యంబునకు నియ్యకొలిపె- తత్ప్రసంగంబు భగవద్గీతాస్మృతి యనంబరగె.

అయ్యెడం ద్రైకాలికలోక ప్రవృత్తి నివృత్తి పరిజ్ఞానధుర్యుండగు పారాశర్య మహర్షి వర్యుండు కురుపాండవ సంగరావసరంబున కృష్ణార్జున సంవాదాత్మకంబైన భగవద్గీతా ప్రసంగంబు పరమరహస్యంబుగ బ్రవర్తించి, న నెఱింగి శ్రీకృష్ణమేఘం బమోఘంబుగ న య్యర్జునాహార్యంబుపై నాశ్చర్య ధుర్యంబుగ నఖండ సచ్చిదానంద స్వరూపాద్వయ సప్ర తియోగిక పరబ్రహ్మ జ్ఞానామృతరసం బపా రధారాసారంబుగ వర్షించిన తద్రసవిసరం బభంగతరంగిత తరంగిణి తెఱంగున నెల్లెడల వెల్లువయై ప్రవహించుచుండునట్లు గాంచి, స్వకృత మహాభారత మహీతలంబున సమంచిత భీష్మ పర్వాభిధానోదార కేదారంబున సకల వేదాంతభావ విఖ్యాత భగవద్గీతాఖ్యోప పర్వోత్కృ వృక్షారామంబుగల్పించి బ్రహ్మానంద రసయోగ విశిష్టంబుగ పుష్పిపద్మం

గావించి యష్టాదశాధ్యాయాంతర్గత శ్లోకే క్షుప్రకాండమండలంబులందు బూర్వోక్తజ్ఞా నామృతరసంబు గోప్యంబుగ నిక్షేపించెను.

అనంతరం బొక్కింత కాలంబునకు నిప్ప రమరహస్యంబు ప్రాచీనులైన పండితులు క ర్ణాకర్ణి నాలించి, పూర్వోక్త భగవద్గీతాశ్లో కేక్షు ప్రకాండంబులఖండించి రసబిందుప్రా ప్తి నానందించిరి.

మరికొంత కాలంబున కమిత దుర్మత పరి హారకులును, ఖిలీభూతాద్వైత మతోద్ధార కులును, అంగీకృతాపర పరమేశ్వరావతారు లును, పరలోక సాధనబోధ ప్రతిపాదకగ్రం థనిబంధనానుమోదులునైన శ్రీమదాది శంక రాచార్యభగవత్పాదులవారు మున్నగు సర్వ కళామండన మండితులైన పండితసార్వ భౌ ములు స్వకీయ మహనీయాఖండ పాండిత్య బ లంబున సప్రథృష్య నిర్గాహ్య భాష్యంబులనె డి ఇక్షుపీడనయంత్రంబులు సంఘటించి భగ వద్గీతోప పర్వ శ్లోకేక్షు కాండప్రకాండంబు లె పీడించి తోడనె తదీయ మధురరసపూరం బు సిద్ధాంతోక్తి పటుఘట కటాహంబులకొ

లంది తాత్కాలిక సూరి జనాగ్రిణులకర్ణాం
జలుల ద్రావించి పూర్ణంబుగదనియించిరి.

పిమ్మట యమ్మహా భాష్యములు పూర్వస
తు సిద్ధాంతములతో సంస్కృత పద పటలం
బుల జటిలంబులై సామాన్య విద్యావంతుల
కత్యంత దురవగాహంబులగుటవలన కొంద
రు పదయోజనాఖ్యాక వ్యాఖ్యానములు,గూ
ఢార్థదీపికలు, కేవలాంధ్రవచనంబులు రచిo
చి వారివారి సామర్థ్యంబుల కొలది భగవద్గీ
తార్థభావంబులు దెలుపుచుండిరి.

మీద నుదాహరింపబడిన భాష్యవ్యాఖ్యా
నాదికర్తలకంటె ప్రాజ్ఞుడనుగాకున్నను పం
డితపామరులకు సులభంబుగ పదార్థభావం
బులు గోచరించునట్లు మృదుమధురతత్సమత
ద్భవాంధ్ర పదకదంబంబుతో రాగానురాగ
సహిత మహిత గీతార్థంబుగా సకల లో
కాంతరంగంబులకు హర్షోత్కర్షంబుగా భగ
వద్గీతాస్మృతి,ద్విపదాకృతిగ, తెనింగించి హ
రిసూక్తితరంగిణియను కృతినిరచియించితిని.

కాళి దాసాది మహా కవికృత ప్రహాతన
గ్రంథంబులందు లోపంబులు చూపట్టుచుండ

గా, తదితరాధునాతన కృతనూతన గ్రంథంబులందు జెప్పనేల? అనవద్యసముద్యమసంపాద్యమానసూత్నామూల్యరత్నంబునందే దోషాన్వేషణంబుగాని తేజులేనిగాజుపూసయందు దోసములు రోయ పనియేమి? అని మదీయకృతిలోపంబులు జూపక, ఇందు గంగాతరంగమనేత్రు కాండంబులందు గ్రమంబుగ నమరిన కళంకపంకనైల్యవక్రతలవలన దత్తచ్ఛీతలపవిత్రత్వ సౌరభ్య మాధుర్యంబులకు హానిరానితీరున భగవన్మహిమాభివర్ణన బంధుర గ్రంథంబున ఛందోవ్యాకరణ వ్యతిరేక లక్షణంబు లుపలక్షితంబులైనను గ్రంథంబు గర్హణీయంబుగాదని, యమందమరంద రస సుందర మందారసుమరాజితో జేరినదారంబునుంగూడ ధరియించిన చందంబున మత్కృత బ్రహ్మజ్ఞానబోధక పదాస్పద భగవద్గీతాద్విపదకృతినిం బొరపాటులు పాటింపక యనుగ్రహంబునం బరిగ్రహింతురని సుధీపురంధరుల బ్రార్థించుచున్నాడను.





# శ్రీ ర స్తు.

## శ్రీ వేంకటరమణపరబ్రహ్మణేనమః.

## హరిసూక్తి తరంగిణి యను
## భగవద్గీతా ద్విపద.

శ్రీరమణ్యానురూప మృదు సుప్రలాప
కారుణ్యరూప వేంకటశైల దీప
నీ దయాలోకంబు నెరపి నాపైని
నాదొక విజ్ఞాపనము చిత్తగింపు
తెలియగోరుచునున్న ధీమంతులకును
తెలుగున గీతా స్మృతిస్థ భావంబు
ద్విపదగా రచియింప దీక్ష గైకొంటి
ఇపుడు నా హృదయమం దిరవుగా నుండి
భవదీయ పాండిత్య బలము నాకొసగి
కవిజన శేఖరుల్ గాంచి హర్షింప
ఈకృతి పూర్తి జేయింపు నాచేత
నీకృప లేకున్న నే నెట్లు నేర్తు
వెండియు గలదొక విజ్ఞాపనంబు
ఇందుగ నాపూన్కి నెరవేర వినుము

శ్రీవత్సగోత్ర వార్నిధి సుధాకరుడు
నై వెల్లు తిమ్మయార్య తనూజులందు
ఆర్యసన్నుతచర్యుడగు నింద్రకంటి
సూర్యనారాయణ సూరి వర్యునకు
బుచ్చెమ్మాంబకు గల పుత్రులయందు
అచ్చుగ నెన్న రెండవ సుతుండనగు
వేంకటశాస్త్రి నా వెలసిన నేను
శాంకరీ సౌభాగ్య సంపన్నమైన
సుందరాంబికయను సుదతియందొక్క-
నందను వేంకట నరసింహ సంజ్ఞు
నన్నపూర్ణాభిఖ్యమైన పుత్రికను
గన్నవాడ చిదాత్మగతి నున్నవాడ
శ్రీమత్త్రిపుర సుందరీ దయాలబ్ధ
కామిత సుకవితా కౌశలుండనయి
వేంకటరమణ గర్వితవైరి హరణ
శంకలేక మదీయ సంతాపములను
సార దయారసాసార ధారలను
వారక వారించి పారంబులేని
నిస్సార సంసార నీరాకరంబు
లెస్సగ నీవవలీల దాటించి
ఐహికాముష్మికానాయాస సుఖము

లీహాలో సంగి నన్నేలమి బాలింప
జతురుండవని నమ్మి స్వామి నీపేర
శతకత్రయ మొనర్చి సరగనీకొసగి
నిన్నెన్ని వన్నెల నీప్రసన్నతకు
సన్నుతించిన నీప్రసాదంబొకింత
నాయందు లేదని నాదైన్యహాని
జేయ జాలుదురని శ్రీమంతులైన
మానవాధముల నున్మార్గవర్తనుల
దీనత దోప నుతించి వేడితిని
కన రేయి బవలును కాకఘూకముల
ననుకరించు ధనాఢ్యులైన మానవులు
తనరు కళాఢ్య విద్వత్ప్రభాకరుల
ధనమదాంధత గల్గి దర్పింప గలరె
కావున నట్టి సకల్మషస్తుతిని
గావించి ఘోరపంకమున మగ్నసన
అపవిత్రయగుట నేడఖిలలోకముల
సుపవిత్రముల జేయ శోభిల్లుచున్న
మృదు భవత్పదము నాహృదయపద్మమున
ముదమున గదియించి పొదలినభక్తిc
బతితపావనకర భవదీయ నామ
కృతనుతిస్మృతి పాఠచర్యాభిధాన

సాంగ గంగాతరంగావగాహముల
సంగతి శుద్ధి పొసంగ గావించి
హరిహరవిధి రమార్యాసరస్వతుల
సరసవాక్కులను పూసరులఁ బూజించి
రవిని వాల్మీకి పరాశరాత్మజుల
ప్రవిమల సంస్కృతాంధ్ర కవీంద్రతతుల
మునుపుగ దక్షిణామూర్తి దైవమును
ఘను జంద్రభట్ట జోగయశాస్త్రివరుని
గురుశిష్యులైన ముకుంద ఫల్గునుల
పరమభాగవతులౌ ప్రహ్లాదముఖుల
క్షమ నాదిశంకరాచార్యవర్యులను
క్రమముగ నామదిం బ్రార్థించి మించి
ద్వైపాయనప్రోక్త భారతస్థమగు
పాపమోచక భీష్మపర్వంబునందు
సాధూక్త యోగశాస్త్రసమాఖ్య నెసగి
సాధు కృష్ణార్జున సంవాదమనగ
దనరు గీతాస్మృతి తాత్పర్యమెల్ల
గనుగొని వివరింప గలవాఁడొకండు
హరియెఱుంగును కొంచె మర్జునుం డెఱుగు
ఒరులెఱుంగుదురన్న సూక్తి మాత్రింబ.
వ్యాసుండు జనకుండు యాజ్ఞవల్క్యుండు

వ్యాసపుత్రుడు శుకుం డర్జునునకై
ఎఱిగియుందురు మఱి యితరులందఱును
ఎఱుగుదురొకలేశ మెలమి నాలించి
కాన గీతాస్మృతిం గల్గు భావమును
గానగ నీయంత ఘనుడు గావలెను
దీనితాత్పర్యంబు దెలియజేయుటకు
నేనెంతవాడను నీరదశ్యామ
ఘనను కొంచె మేనాలించినట్లు
ఏనెనరున దెల్ప నీమాటకతన
జానుగ దేవభాషాపరిజ్ఞాన
హీనపామరులకు హితకారి గాగ
బాలతులకేనియు బోధించునట్లు
తెలుగుభాషాశైలి ద్విపదరూపముగ
వెసమ్మదూక్తులతోడ విరచించి కృతికి
రస హరిసూక్తి తరంగిణి యనగ
తగిననామమిడి తత్ప్రతిభాగమునకు
ఒగి తరంగాభిఖ్య నొనరించి పేర్మి
నాకోర్కె నెరవేర నగరాడ్విహార
నాకృతికన్యకా నాథుండ వీవ
యనుచు నీకృతికన్య నర్పింతు నీకు
ననుకంప దీపింప నలరి చేకొనుము

కృతికన్యయందుండు నెల్లతప్పులను
చతురతతో నీవ సవరించుకొనుచు
పుత్రికాసంతతి బుట్టించి దీని
పుత్రికల్ భువినిండి పొలుపొంద నిమ్ము
మహీ రమా మానినీ మణ్యవతార
మహితయా సలవేలి మంగతో కూడి
అకలంకమగు వేంకటాద్రియందున్న
అకలుషాత్మునకు నీకర్పణంబుగను
అమరు నీనలువ రెండవపరార్ధమున
రమణీయ గౌర వరాహకల్పమున
మలయు వైవస్వత మనువుకాలమున
పలుగాకి కలివేళ బ్రథమపాదమున
అదనగు శాలివాహన శకంబందు
పదునెనిమిది నూర్ల పదియు రెండవది
యవు విరోధ్యబ్దమం దజ్ఞమానమున
రవి దక్షిణంపు మార్గమునందు నుండ
కలిత శరత్వేళ కార్తికంబందు
సలలిత శుక్లపక్ష తృతీయయందు
వడి బాపముల బాప వరలు నీకృతిని
గడగితి రచియింప గరుణింపవయ్య.



శ్రీ రస్తు.

# హరిసూక్తి తరంగిణి.

## అర్జున విషాద యోగము.

### ప్రథమతరంగము.

శ్రీ మంజువదన రాజిత కుందరదన
కామినీ మదన వేంకటశైల సదన
ప్రవరార్యగేయ కర్ణరసాయనముగ
నవధరింపుము కథాప్రారంభవిధము
శ్రీమహనీయుడు ధృతరాష్ట్రవిభుడు
సామరస్యమున సంజయునకిట్లనియె
భూమిని సంజయ పుణ్యరాసులకు
సీమ నాఁబడు కురుక్షేత్రంబునందు
దుర్యోధనాది మత్పుత్రకుల్ ప్రబల
ధైర్యసంపన్నులు ధర్మాత్మజాది
పాండు సర్వంసహాపాల పుత్రులును
భండనంబొనరింప వాంఛించి కూడి
ఏమి గావించిరో నెఱిఁగింపుమనుడు
సావధానమ్మున సంజయుఁడిట్టులనియె

ధృతరాష్ట్ర విను రాజయిన సుయోధనుడు
ధృతబుద్ధి వ్యూహాకృతిగ నొడ్డబడిన
పాండవసైన్యంబు బరికించి యపుడ
బొడన కేవరితో నాకద్రోణు జేరి
వచియించె నతని కిప్పగిది నమ్రుడయి
సుచరిత్ర నీకు శిష్యుడు బుద్ధియుతుడు
ప్రబల పాంచాల భూవరకుమారుడును
సబలుండునైన ధృష్టద్యుమ్నుచేత
కడక వ్యూహాకృతిగా రచింపబడి
పొడవు మీరెను బాండుపుత్ర సైన్యంబు
పరికింపు మీ పాండవ బలంబునందు
నరయ మహారథుండగు ద్రుపదుండు
ఉరుపరాక్రమవంతు డుత్తమౌజుండు
గురుతర బలశాలి కుంతిభోజుండు
చేకితానుడను కాశీరాజ్యనృపతి
తేకువ గలవాడు ధృష్టకేతుండు
అరిభీకరుండు శైబ్యనృపాలవరుడు
పురుజిద్యుధామన్యు భూరివిక్రములు
ద్రౌపదీసుతులు విరాటసాత్యకులు
ఆపైని యభిమన్యు డతిరథోత్తముడు
ధరణిపాలురు శౌర్య ధైర్యవంతులగు

వరధనుర్ధరు లాహవక్షోణియందు
భీమార్జున సమాన వీరులున్నారు
క్షామరోత్తమ మదీయ బలంబునకును
రక్షకు లెవరో వారల నీకు దెలియ
ఈక్షణంబున వచియించెద న్వినుము
మనవారిలో గార్యమతిచేత నెవరు
ఘనులో వారి నెఱింగి గ్రహియింపుమీవు
నీవు భీష్ముడును గానీనుండు కృపుడు
వావిరి ఘూరిశ్రవస్సును నట్లె
ఒకని నశ్వత్థామయును వికర్ణుడును
జగతిని నాప్రయోజన నిమిత్తంబు
ప్రాణంబులును విడువంగ నున్నారు
పూని యనేకు లిప్పుడు చెప్పబడిన
వారికంటెను సైంధవప్రముఖులగు
వీరలందఱు మహావీరశేఖరులు
వివిధాయుధవిశేష విభవభాసురులు
వివిధసాధనముల వెలయువారలును
గాన నుదారసంగర విశారదులు
ఐనను శంతను నాత్మజుచేత
అభిరక్షితంబయ్యె నస్మద్బలంబు
శుభముగా బూర్ణమై చూపట్టుకుండె

గాన బాండవుల నొక్కఁగ జాలఁడేమొ
పూనిక నీపాండవుల సర్వబలము
క్రమముగా భీమాభిరక్షితంబగుచు
ప్రమదపూర్ణముగ జూపట్టుచునుండె
ధీరత వ్యూహప్రదేశమార్గముల
మీరంద ఱివ్వేడ మీకు నిర్ణీత
దారుణ సంగరస్థలిని మీఱకయె
పేరిమినుండుచు భీష్మ నేమరక
ఒప్పుగ రక్షించుచుందురుగాక
తప్పరాదనుచున్న ధార్తరాష్ట్రునకు
కరము సంతోషంబు గలుగఁ జేయుచును
కురువృద్ధును బ్రతాపగుణవంతుడైన
సురనిమ్నగా తనూజుడు సింహనాద
మరుదుగా గావించి యతిభీకరముగ
పూరించె శంఖంబు పొలుపొందఁ పిదప
కౌరవ సైనికాగ్రణులు శంఖములు
వరగోముఖానక పణవదుందుభులు
వరుసగబూరించి వాయించిరంత
ఆవాద్యనిర్ఘోష మంతట నిండె
ఆవెనుక ధవళవాహముల బూన్పబడి
ఉన్నతంబై మించు నొకరథ మెక్కి
తేరిపయి

ఉన్న కృష్ణార్జును లొక్క వైఖరిని
దివ్యశంఖంబు లొత్తిరి సుచిత్తముల
భవ్యంబుగ మురారి పాంచజన్యంబు
దివిజరాజసుతుండు దేవదత్తమును
పవమానసూనుండు పౌండ్రనామకము
సదనంత విజయంబు శమనపుత్రుండు
తదనంతరము మాద్రితనయు లిద్దఱును
మానసీయ సుఘోష మణిపుష్పకముల
పూని క్రమంబుగా బూరించి రపుడు
అనివార్య విక్రము డర్జునాత్మజుడు
ఘనతరచాపంబు గల కాశిరాజు
అరయ మహారథుండగు శిఖండియును
వరుస ధృష్టద్యుమ్న వర విరాటులును
అపరాజిత బలిష్ఠుడగు సాత్యకియును
ద్రుపద దౌహిత్రులు ద్రుపదభూపతియు
ఈచెప్పబడిన వీరెల్ల వేర్వేర
ఏచి శంఖము లొత్తిరి ఖపురాధీశ
హరి ఫల్గునాది శంఖా మోఘరవము
కరము సంకులమయి గగనంబు నిలను
ప్రతిరవంబుల భీకరముగ నింపుచును
ధృతరాష్ట్ర నృప యుష్మదీయులైనట్టి

దుర్యోధనాదుల దుష్టచిత్తముల
ధైర్యంబు చెడల డెందము వ్రక్కలించె
ఉభయసేనల నున్న యోధాగ్రసరుల
రభసపూరిత శంఖరవము పిమ్మటను
స్వనదిషపాతంబు వర్తించుచుండ
హనుమద్ధ్వజుండైన యర్జునుండపుడు
మిన్నక పోరంగ మిగుల యత్నించు
చున్న నీసుతుల దుర్యోధనాదులను
కనుగొని తనకార్ముకం బెక్కువెట్టి
వనమాలి నీక్షించి వచియించె నిట్లు
వనజాక్షు యీరణోపక్రమమందు
మొనసి నేనెవరితో పోరంగవలెనో
యోధులైయుండిన యోద్ధుకాములను
నీధార్తరాష్ట్రల నెంత వేగముగ
అరయ జాలుదునో నీవంత వేగముగ
తురగోత్తమంబుల దోలి యిత్తఱిని
ఇరవొందు రెండు వాహినుల మధ్యమున
సరిగ నాయరదంబు స్థాపింపుమయ్య
దుష్టబుద్ధియుతుండు దుర్యోధనునకు
ఇష్టంబు గావింప నీయుద్ధమునకు
ఏవీరు లీతరి నేతెంచినారో

కావరంబున బోరగల బలిష్ఠులగు
నీవిరులను నేను నీక్షింతు కృష్ణ
నావచోరీతి గ్రన్నన నాచరింపు
అని చెప్పి మఱియు నిట్లనియె సంజయుఁడు
మనుజేంద్ర విజయుఁ డిమ్మాడ్కి పల్కఁగను
మురవైరి యుభయ చమూమధ్యమందు
పారి ద్రోణ భీష్మల ముందఱనున్న
సకలరాజన్యుల సంతతి కెదుట
ప్రకటంబుగ రథంబు పడిదోలి నిలిపి
ఓకిరీటి సమీక మొనరింపనున్న
ఈకురుసైనిక బృందంబు గనుము
అని సవ్యసాచితో హాసి పలుకఁనపుడు
వనచరధ్వజుఁ డిరువాగులందున్న
తాతల చిన పెద్ద తండ్రిలన్ గురుల
భ్రాతల బుత్రుల పౌత్రులన్ సఖుల
మామల మేనమామలనింక మరియు
భూమీశులందలి పురుష పుంగవుల
ఉపకారులనుగూడ నొగిజూచి విజయు
డపుడందునున్న వారందరజూడ
బంధువులని దయా బంధురుండగుచు
వ దురుచిగతి బలికె కృష్ణునికి

కమలాక్షుయని సేయ గాంక్షించివచ్చి
సముపస్థితంబగు స్వజనంబు జూచి
సకలావయవములు సడలుచు నుండె
మొకమెండుచుండె నిప్పుడు మేనవణకు
కడుఁరోమహర్షంబు గలుగుచునుండె
కడెది హాస్తమునుండి గాండీవధనువు
జారుచున్నది మేను జ్వలియించు చుండె
సారెకు నామానసము దిట్టముడిగి
కదలిన దానివై ఖరి నుండె గాన
కుదురుగ చేరిపై కూర్చుండ జాల
విపరీత శకునముల్ వీక్షించుచుంటి
చపలత నని బంధుజనమునుజంపి
పిదప మేల్గానను విశ్వంభరుండ
ఇదెవిను సమరంబు నేనిచ్ఛగింప
కోరను రాజ్యంబు కోరను గెల్పు
కోరను సుఖముల గోపాలదేవ
మాకేల రాజ్యంబు మాకేల బ్రదుకు
మాకేల భోగముల్ మాధవాయికను
ఏచిమేద్రోణాది హితులకై యిపుడు
మాచేత మారాజ్య మహిత భోగముల
పట్టగు సుఖములు వాంఛింప బడెనో

అట్టి యీద్రోణాదులగు నెల్లవారు
ప్రాణధనంబులు వర్జించి యిప్పుడు
మానక సంగ్రామమహి నున్నవారు
తాతలు పౌత్రపుత్రకులు తండ్రులును
మాతులస్యాల సంబంధి ముఖ్యులును
క్రౌర్యంబుచే మమ్ము గారించుచున్న
దుర్యోధనాదుల దొడరి త్రైలోక్య
రాజ్యంబుకొరకేని ప్రహరింపబోను
ఈజ్యానిమిత్త మింకేల చెప్పవలె
దుర్యోధనాదుల ద్రుంచుట చేత
పర్యాప్తమగు విష్టప త్రయ ప్రాప్తి
గలిగిన నేని నిరాకరణంబుగను
అలిగి వారలు మమ్ము నడపవచ్చినను
వారలజంపగ వాంఛింపనేను
అరగాగ నిదియగా దచ్యుతా వినుము
అనిలోన దుర్యోధనాదుల జంపి
మనకేమి హర్షమౌ మాధవా చెపుము
విషము పెట్టినవాడు వెసఖడ్గమూని
విషముపైనరకంగ విచ్చేయువాడు
పరదారహర్తయు బరభూమిహర్త
పరధనహర్తయు భవన దాహకుడు

అనేదు నీయార్వ్వరు నాతతాయులుగ
ననుదు రీదృశులంబు యగపడుచున్న
ఈధార్త్ర రాష్ట్రుల నిల గూల్తుమేని
బాధక పాపమే ప్రాప్తించు మనకు
గాన బాంధవులను ఖండించియెట్లు
మానిత సుఖులము మనము కాగలము
కావున ప్రమందింపగారాదు బాంధ
వావృత ధార్త్ర రాష్ట్రాదుల మనకు
అధిరాజ్య లోభోపహత చిత్తులగుచు
అధము లీదుర్యోధనాదు లన్వయము
క్షయమొనర్చుటచేత కలుగు దోషమును
భయాద మిత్రద్రోహ పాతకప్రాప్తి
తెలియంగ జూడ రేతెఱగునవైన
కులనాశకృతమైన ఘోరదోషమును
గను మనచేత నీకలుషంబు వలన
వినివర్తి కొరకు నెవ్విధి గానరాదు
కులనాశమగుచుండ గుణవంతములగు
సలలితస్థిర కులాచారము లెల్లయు
ఆచారమడగిన నఖిల వంశమును
పేచి యనాచారమే యాదుకొనును
జలజలోచన యనాచారంబువలన

కులకామినుల్ చెడుగులయి పోయెదరు
వెలదులు స్వాచార విభ్రష్టలైన
గలుగును వర్ణసాంకర్యంబు కృష్ణ
వర్ణసాంకర్యంబు వంశఘ్నులకును
వర్ణింప సంకీర్ణ వర్ణంబునకును
నరకమొందగ కారణంబుగా నుండు
సరగ నీసంకీర్ణ సహితులౌ వారి
పితృదేవతలు లుప్తపిండోదకాది
హీతకృత్యులై యధస్సృతుల గూలుదురు
ఇద్ధరా ద్విజప్రభృతి వర్ణములకు
శుద్ధసంకర మొసర్చుచు నున్నయట్టి
కులనాశకారుల ఘోరపాపముల
వలన పరంపరాప్రాప్తంబులైన
వర్ణధర్మంబులు వంశధర్మములు
• ఘూర్ణితంబులుగఁ బోగొట్టంగ బడును
పురుషోత్తమా యట్లు పోగొట్టబడిన
స్ఫురిత కులాచారములు గల్గినట్టి
నరులకు నరకమెన్నడును వాసమగు
పరులకు దప్పింప వశముగా దెవ్వడు
అనవిందుమా ధరిత్రియం దేమికతన
ఘనము రాజ్యసుఖ సంపత్ప్రలోభమున

అలిగి బంధుజనాళి నడగింపవలపు
గలిగియుంటిమొ దానికితన హెచ్చైన
పాపంబొనర్ప బాల్పడితి మారకట
ఏపున నాయుధోపేత హస్తులౌచు
దుర్యోధనాదులు తోడరి యాయుధము
గార్యంబునుం బ్రతీకారంబు నుడిగి
ఉన్న నన్నునియందు నొరసి యుద్ధవడి
మన్నిగొనుదురేని మహానిదన్మృతియు
దనరనాకు సహింపదగినదే యగును
అనియట్లు పార్థుండు హరితోడబలికి
కానిదుఃఖముచేత గదలింపబడిన
మానసంబునజేతి మార్గణోపేత
ధనువును విడిచి యుద్ధమున దేరిపయి
వనటచుగూర్చుండె పార్థివోత్తముడ
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీ సూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
కనచంద్రకంటి వేంకటశాస్త్రి కృతమౌ
రమ హరిసూక్తి తరంగిణియందు

శమహీనవిజయు విషాదయోగంబు
అనబడు మొదటిది యగుతరంగంబు
దనరనీకిది యర్పితంబౌను గాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీ ర స్తు.

# హరిసూక్తి తరంగిణి.

## సాంఖ్యయోగము.

### ద్వితీయ తరంగము.

శ్రీ వేంకటాద్రీశ శ్రితహృన్నివేశ
నావిన్నపంబు తిన్నగ నాలకింపు
పిదప నాధృతరాష్ట్ర విభుని వీక్షించి
సదమలోక్తులనిట్లు సంజయుండనియె
పరమదయాళుత్వ భరమావహించి
గురుబాష్ప పూరితాకుల నేత్రుఁడగుచు
మును జెప్పినటు ఖేదమును బొందు పార్థు
గనుగొని పంకజేక్షణు డిట్టులనియె
అమరలోకానర్హ మపకీర్తికరము
మమకారసహిత పామర సేవితంబు
అయిన యీపటుమోహ మసమయంబందు
జయశీలనిన్ను నేసరణి దాకొనియె
అనవద్య పౌరుష హాని పాల్పడకు
అనుపపన్నమిది నీయందు ఫల్గునుడ

అడచినీమది తుచ్ఛమగు నధైర్యంబు
తడయక లెమ్ము యుద్ధమున కర్జునుడ
అనుడు కృష్ణునకు నిట్లర్జునుండనియె
వనజాతనేత్ర సపర్యార్హులైన
ద్రోణుని భీష్ముని దురమందు నెదిరి
బాణంబులేనెట్లు పరప నోపుదును
అరయగా మహనీయులైన ద్రోణాది
గురువులఁజంపక కులంబునందు
భిక్షాన్నభోజన వృత్తి శ్రేయంబు
అక్షయ ద్రవ్యార్థులగు ద్రోణముఖుల
తెగదున్మియును రక్తదిగ్ధ భోగముల
అగడుగ నీలోకమందె భుజింతు
ఎలమితో నాలింపు మింతియెగాక
తలపమేమనియందు ధార్తరాష్ట్రులను
గెలువంగగలమొకో గెలువంగలేమొ
సోలయక ధార్తరాష్ట్రులె గెల్తురో కో
ఏది శ్రేష్ఠంబొ మాకీ రెంటియందు
ఆదినోడుదు గెల్పు నవశం బెఱుంగ
ఏ ధార్తరాష్ట్రుల నిక సంహరించి
ఈధాత్రి బ్రదుకిచ్ఛయింప మంద్రెదమొ
వారభిముఖమునం దవస్థితులైరి

వారక వగవు భావమునందు నిలచె
కృపణత్వమనెడి దుష్కృతశక్తిచేత
నుపహతస్వీయ శౌర్యుండనైనేను
న్యాయమంబునందు జ్ఞానంబు చొప్పడక
పోయిన మానసంబు గలట్టినేను
అడిగెద నాకు సయ్యన నిర్ణయింప
బడినశ్రేయస్సేది బలుకుము దాని
నీకు నేశిష్యుండ నిను శరణంటి
చేకొని కరుణచే శిక్షింపునన్ను
అరిది యింద్రియముల కత్యంత శోష
కరమైన నాశోక కలనమెద్దాన
అడగు నకార్యంబు నవనిలో నాకు
కడు సమృద్ధమయి నిష్కంటకంబగుచు
నడచు రాజ్యము నమరాధిపత్యమును
బడసియు గానను వసుదేవతనయ
అనియిట్లు పరహంత యగు నర్జునుండు
అని జేయననుచు హృషీకేశునీక్షించి
పలికి యూరకయుండె భారతాయనుచు
దెలిపి సంజయుడప్డు ధృతరాష్ట్రుతోడ,
వెండియునీరీతి వివరింపదొడగె
రెండు సేనలమధ్య పృథివి తేరిపయి

అనపాయ శోక మోహాభ్రష్టమైన
మనసున ధైర్యంబు మరికాన లేక
మలగు పార్థునిమిత్త మాత్రంబుజేసి
యలఘు గూఢాశ్రయాధ్యాత్మ తత్వంబు
గలు మృదూక్తుల పరంపర వెల్లిగొలిపి
మెలమిని లోకోపకృతి సేయదలచి
వగచుచుండిన పార్థు వదనంబు గాంచి
నగధారి హాస్యం బొనర్చువానివలె
వచియింపదొడగె నీవక్ష్యమాణగతి
సుచరిత్ర యోబలసూదనపుత్ర
అడలంగ దగని భీష్మాదుల గూర్చి
అడలుచు బండిత వ్యాహారములను
పలుకుచుంటివి నీవు పండితునట్ల
వెలయ నాత్మానాత్మ విదులైనవారు
మృతిబొందియున్న వారినిగూర్చి మరియు
బ్రతికి యుండినయట్టి వారినిగూర్చి
పండితులగువారు వగవకుండెదరు
గాండీవ సకలలోకప్రభుండనగు
ఏనెప్డు లేకపోయినవాడగాను
ఆనరిది నవినాశి నగుచెసంగాదను
ఈనీవు లేకపోయినవాడు గావు

ఈనృపుల్ లేకపోయినవారు గారు
నరవర్య యీదేహ నాశనంబైన
తరువాత నుమనమందఱము నిక్కముగ
వడి లేకపోగలవారము గాము
తడయక దేహంబు ధరనశించినను
మనమందఱము చిదాత్మ స్వరూపముగ
ననయంబు నిత్యులమై యుండగలము
దేహికి నీస్థూలదేహంబునందు
నూహింప బాల్యము నొగి జవ్వనంబు
జరయను మూడవస్థలు గల్గినట్లు
పరగ దేహాంతర ప్రాప్తియుం గల్గు
జడదేహమున కవస్థా భేదములును
మడియుటగల్గు నాత్మకు గల్గబోదు
కావున ధీరుఁడా కాయికనాశ
భావంబులందు మోహపడకుండు నెప్పుడు
పంచతన్మాత్రలవలన జన్మించి
అంచితంబులగు శ్రోత్రాదీంద్రియముల
వరివగు శబ్దాది విషయ యోగములు
సారదిగ శీతోష్ణ సుఖదుఃఖదముల
రోగ వియోగంబు లొప్పుచుండినవి
సేగకి నెలవు లస్థిరములుగాన

ఓపార్థ యట్టి శీతోష్ణాదులెల్ల
సైపుము సుఖముఁ బ్రసక్తించువేళ
మోదమున్ దుఃఖంబు మొనసినవేళ
ఖేదమున్ గనకొకాకృతి గల్గియుండు
సురరాజతనుజాత సుఖదుఃఖములను
సరిగనిశ్చలుఁడై మెసంగు నేపురుషు
నిట్టి మాత్రాస్పర్శ లేపలేకుండు
నట్టి పూరుషవర్యుఁ డమృతత్వమొందు
పొరిపొరి చెడు దేహమున కున్కి లేదు
పొరి సదాత్మకు లేకపోవుటలేదు
ప్రస్తుతంబైన పరబ్రహ్మమనెడి
వస్తు వెఱింగిన వారలచేత
సమముగ నీరెండు సదసత్తులైన
యమలతరాత్మ దేహముల నిర్ణయము
వీక్షింపగాఁబడు వివరంబుగాను
రక్షితాపన్నమే బ్రహ్మంబుచేత
వ్యాపింపఁబడెనో యీ యఖిల ప్రపంచ
మా పరబ్రహ్మము నవినాశిగాను
ఎఱుగుము వ్యయమైన యీయాత్మనొకడు
నఱిమి నాశ మొనర్ప నర్హుండుగాఁడు
ధ్రువము సంతత మేకరూపమైనదియు

సవతులేనిది వినాశంబు లేనిదియు
ఘనత ప్రత్యక్షాదిక ప్రమాణముల
కనిశం బగోచరమైన యాత్మకును
అనువొందు నీమేను లంతవంతములు
అని తత్త్వవిదులచే ననబడుచుండు
గాన భీభత్స సంగ్రామం బొనర్పు
మేనరుఁ డీయాత్మ నేఁజంపువాఁడ
అనుకొను నెవ్వ డీయాత్మను నిహతు
ననుకొను నాయిర్వు రనభిజ్ఞులరయ
పరముఁ డీయాత్మ చంపఁడు చంపఁబడడు
నరుఁడ యీయాత్మ జన్మములేనివాఁడు
అనయముండెడివాఁ డనాది శాశ్వతుఁడు
కనగ నీయాత్మ యొకానొకప్పుడును
పుట్టఁడు చావడు ముందు నీయాత్మ
పుట్టి వెండియు పుట్టువును బొందబోఁడు
కావున దేహంబు ఖండింపబడిన
చావడందున నాత్మ షడ్భావిగాడు
నృపవరేణ్యా యీయాత్మ నేకరూపునిగ
నవినాశునిగ నవ్యయునిగా నజుగ
నెవడెఱింగెడినో వాఁ డేప్రకారముగ
నెవనిజంపును నెట్లు నెవని జంపించు

చెలువుగ మనుజుండు శిథిలంబులైన
వలువలు విడిచి నవ్యములైన యితర
పటములుధరియించు వైఖరి నాత్మ
తటుకున శిథిలగాత్రములు వర్జించి
అన్యముల్ గ్రొత్తదేహము లొందుచుండు
మాన్య యీయాత్మను మహాదాయుధములు
దునుమ వీయాత్మ నెందును పావకుండు
అనువుగ గాల్పడీయాత్మను నీరు
తడుప దీయాత్మ నెత్తఱి మారుతంబు
చెడమిని శోషింప జేయదు పార్థ
చేరిక నీయాత్మ ఛేదింపదగదు
ధారుణి నీయాత్మ దహియింప దగదు
తడవగ నీయాత్మ తడపగా దగదు
ఎడజొచ్చి యీయాత్మ ఎండింపదగదు
కావున నీయాత్మ కదలకయుండు
ఈవిశ్వమెల్ల దానే నిండియుండు
అవినాశి సుస్థిరుం డాదిశూన్యుండు
ప్రవచనాలభ్య స్వభావుడీయాత్మ
చక్షురాదుల కగోచరుడు నీయాత్మ
అక్షీణతరుడు మానాగోచరుండు
ఈయాత్మ కర్మేంద్రియమైకావిషయుడు

ఈయాత్మ యనుచు నిట్లిపుడు చెప్పబడు
అందున బూర్వోక్తమైన యీయాత్మ
చందమెఱింగి విషాదింప తగవు
ఇలపయి బార్థుండ యేకారణంబు
వలన జన్మించిన వానికింజావు
నిశ్చయమో మృతునికి సంభవంబు
నిశ్చయమోయట్టి నెరికారణమున
అపరిహార్యమగు కార్యంబునకీవు
కృపణత బూని దుఃఖింపగాదగవు
తనువుల్ ప్రధాన తత్త్వస్వరూపంబె
ముమవుగాగలవి యిప్పుడు గానుపించు
మరణ జన్మంబులు మధ్యంబుగలవి
పరగ ప్రధానతత్త్వమునందె లయము
గలవియు నగునట్టి కాయంబులకును
విలపింప నేటికి విజయుండ నీకు
భూమి నొకానొక పురుషుడీయాత్మ
నేమిరొయొకప్పుడు నీక్షింపబడని
ఆశ్చర్య వస్తువు నాకస్మికముగ
నిశ్చయంబుగ గాంచు నేర్పునజూచు
అటుల వేరొక్కడీయాత్మ నాశ్చర్య
మటుల వేరొకని కొయ్యాన జెప్పుచుండు

ఇతరు డీయాత్మ నెయ్యెడ నద్భుతంబు
గతివినుచుండు నోకానోకంబైన
వెలయు నీయాత్మను వినియు జూచియును
పలికియు తెలియనోపడు ఫల్గునుండ
అకలంకముగ లోకులందఱు స్వీయ
సకలాంగములయందు సర్వకాలముల
ఓమిత్రుడా నిండియున్న నీయాత్మ
నేమాయచేతను నెఱుగకున్నారో
అట్టి యీమాయయే యఖిలవిశ్వమును
బెట్టుగభ్రమపెట్టు వినుమెంతవింతో
నరసురాసురముఖ నానాశరీర
ధరుల శరీరవధంబొనర్చినను
ఈయాత్మ యెప్పుడు హింసింపబడదు
ఈయెడ నదిగాన నిక నీకశేష
భీష్మాదికౌరవ విగ్రహంబులకు
ఊష్మగ దుఃఖింప యోగ్యంబుగాదు
కనగ నింతియగాదు క్షత్రధర్మమును
కనుగొని యెంతయు గంపింపదగవు
ఆయోధనముకంటె నవని పాలునకు
శ్రేయంబు వేఱొక రీతిది లేదు
స్వైవలోకమునకు ద్వారభూతంబు

ఆవృతిలేనిది యాచింపబడక
ప్రాప్తంబయిన యిట్టి ప్రథన మెవ్వరికి
ప్రాప్తించు నాన్నృపుల్ భాగ్యసంగతులు
తదనంతరమ్ము స్వధర్మ యుక్తమగు
నది యుద్ధమీవు సేయక పోతివేని
దాన నీవాత్మీయ ధర్మఫలమును
మానితంబైన సమాఖ్య వర్జించి
దేవదయాలబ్ధ దివ్యాస్త్రశస్త్ర
పావనచర్య పాపము పొందగలవు
ఇంతియెగాదిల నెల్లప్రాణులును
అంతమొందని భవదపకీర్తిమాట
అనుకొందు శౌర్యధైర్యాది గుణముల
ఘనతసన్మానంబు గనిన ధీరునకు
అపకీర్తి మృతికంటె నధికమై యుండు
కృపణత నీవొందనేల కౌంతేయ
ఏధార్తరాష్ట్రుల కీవెవ్వ శౌర్య
ధీధైర్య బలగుణాది సమృద్ధిచేత
సన్మానితుండవై చాల నొప్పితివొ
తన్మహారథికులౌ ధార్తరాష్ట్రులిక
భయపడి యనినుండి పారిపోతివని
నియుతవిధంబుల నిను దలంచెదరు

తొలుతను బహుమానితుండవై పిదప
చులకదనంబు హెచ్చుగ పొందగలవు
నీదు సామర్థ్యంబు నిందసేయుచును
నీదు విపక్షు లనేకంబులైన
పలుకరానివి పెక్కు పల్కుచుండెదరు
అలఘు దుఃఖంబేది యగునంతకంటె
అహితులచే యుద్ధమందు నర్జునుడ
ప్రహతుండవైన స్వర్గంబు పొందెదవు
ఒగి శాత్రవుల నీవ యోర్చితివేని
జగతి భోగముల నాస్వాదింపగలవు
గానఁ బార్థుండ సంగ్రామంబొనర్ప
బూనిన నిశ్చయంబున వేగలెమ్ము
సొరది జయాజయసుఖదుఃఖములను
పొరయు లాభాలాభముల సమమ్ముగను
చేసి పిమ్మట పోరసిద్ధంబు గమ్ము
ఈసరణిన్ రణంబిక జేయ నఘము
అందవుగద సాంఖ్యమం దాత్మతత్త్వ
మందలి యీప్రోక్తమగునట్టి బుద్ధి
ఉక్తమైనది నీకు యోగమందింక
రక్తిగ నీబుద్ధి ప్రసరింప వినుము
ఒనర దద్బుద్ధితో యుక్తుండవగుచు

ఘనకర్మబంధంబు గడకొత్తగలవు
కౌరవవర్య యీకర్మయోగమున
నారంభ నాశనం బమరుట లేదు
ప్రాకటంబుగ బ్రత్యవాయంబు లేదు
ఈకర్మయోగమం దేమాత్రమైన
తదుపక్రమము మహద్భయద సంసార
విదితబంధమునుండి విడిపంచిసనుచు
దావలంబగు నీవిధానంబుసందు
ధీవర్య నిశ్చయాత్మిక బుద్ధి వరము
క్రమరీతి నిశ్చయరహితుల బుద్ధు
లమితముల్ బహుశాఖ లమరినదాని
వలె ఫలాసక్తముల్ పాండుకుమార
బలవత్తర స్వర్గఫలలబ్ధికంటె
క్రమమైన దన్యమొకండు లేదనుచు
స్వమనోజ్ఞ వేదార్థవాదములందు
క్షితి నపండితులు పుష్పితశాఖ పగిది
నతి సుందరంబగునట్టి యీస్వర్గ
ఫలము జెప్పెడివాక్కు పల్కుచునుండ్రు
వెలయంగ నీపలుకు వినుము ఫల్గునుడ
చిత్తము కోర్కెలజేరి స్వర్గంబె
ఉత్తమపురుషార్థ మొకడనువారు

స్వర్గ ఫలానుభవము మీదజన్మ
దుర్గ కర్మములను దుష్ఫలంబులను
దనరించు సుఖవిభుత్వ ప్రాప్తికొరకు
పొనరు కార్యవిశేషముల్ బహువిధములు
గలిగి యున్నట్టి వాక్యము జెప్పుచుండ్రు
తెలగు సుఖప్రభుత్వముల నాసక్తి
కలిగి క్రియాభేద ఘనపుష్పితోక్తి
బలనుచే నపహృత భావుల కెల్ల
తివుటమై నిశ్చయాత్మకమైన బుద్ధి
అవుల సమాధియందు విధింపబడదు
తెనర వేదములు సత్త్వరజస్తమంబు
లను గుణంబులతోడ నలరువారలకు
తదనురూపఫల ప్రదంబులౌ గాన
త్రిదశేంద్రసుత నీవు త్రిగుణాతిగుడవు
చొక్కి శీతోష్ణాది సుఖ దుఃఖములకు
గ్రుక్కనివాడవు సుస్థిరంబైన
సత్త్వగుణ విశేష సహితుండ వాత్మ
తత్త్వజ్ఞుడవు స్వీయ ధర్మయుక్తుడవు
పరిణయ యోగక్షేమ రహితుండవగుము
పని యెంతమాత్రము బావియందగునొ
అంతట జలపూర్ణమగు హ్రదంబునను

అంతే ప్రయోజనం బగుచుండుగాన
ఎంత ప్రయోజనంబెల్ల వేదముల
నంత ప్రయోజనంబగును సుజ్ఞాని
యైన బ్రాహ్మణునకు నమరేంద్రతనయ
వినులారగ నీవు వినుము చెప్పెదను
నీదధికారంబు నిత్యనైమిత్తి
కాది కర్మమునందె యమరుచు నుండు
ఆశ కర్మఫలంబులం దొకప్పుడును
లేశమేనియు నీకు లేకపోగాక
ఏకర్మ ఫలమునకేని కారణము
గాకయుండుము నీవు కౌంతేయవినుము
ఏకర్మములబంధ హేతువుగాదొ
ఆకర్మ మేవిద్య యమ్మత కారణమొ
ఆవిద్యయు గడు శ్రేయంబులై యుండు
ఆవిధంబులు గాని యన్య కర్మములు
ఆవిద్యలన్నియు నాయాసమునకు
ప్రాపిణ్యమునకు గారణములై యుండు
కావున తాదృశకర్మ విద్యలను
భావింప నించుక పనిలేదు నీకు
నీ కకర్మాసక్తి నెరిపోవుగాక
ఆకాంక్షిత ప్రాప్తి నప్రాప్తియందు

బాగుగ సమముగ భావముండుటయె
యోగమంచు ధనంజయుడ చెప్పబడును
ప్రియముగ యోగపరీతుండవగుచు
జయపరాజయముల సముడవై యుండి
ఆసక్తి యుడిగి యుద్ధాది కర్మముల
వేసరకొనరింపు విజయుండ నీవు
శర్మదాకామ ధీస్వాంత సంయుక్త
కర్మముకంటె సకామకర్మంబు
కనగ దూరంబౌట కడు నికృష్టంబు
ఘనకామ్యఫలములే కారణంబులుగ
నమరువారు నికృష్టులైన సంసారు
లమితు నవ్యయు పరమాత్మ నెవ్వాడు
పడయనేరడో వాడు పరలోకమునను
నెడప కేగినయేని కృపణుండె యనుచు
మానక శ్రుతియె సంభాషించుగాన
జ్ఞానంబు విషయమై కర్మ మర్థింపు
అసముగ ప్రాప్తియం దప్రాప్తియందు
సుసమత్వ బుద్ధితో సొంపొందువాడు
పుణ్య పాపముల నీభూలోకమందు
గణ్యంబుగ త్యజించు గాన కౌంతేయ
యుక్తుండవగు బుద్ధి యోగంబుకొరకు

వ్యక్తంబుగాను ప్రాప్త్యప్రాప్తులందు
సుసమత్వబుద్ధి గాంచుటయే కిరీటి
అసమాన కౌశలం బన్నికర్మముల
మోక్షవిషయబుద్ధి బూనినయట్టి
వీక్షితాత్మానాత్మ భేదసంగతులు
కృతకర్మజ ఫలంబులెల్ల వర్జించి
క్షితిజన్మమనెడి సంకెలచేత కరము
వదలంగబడి యెట్టి బాధలులేని
పదమొందుచుందురు పార్థుండవినుము
దీపించి నీబుద్ధి దేహాభిమాన
రూపపంకంబు నిర్మూలించు నెపుడు
అపుడు వినందగు నర్థంబునకును
విపులంబుగానీవు వినినర్థమునకు
పౌనరంగ వైరాగ్యమును బొందగలవు
మును చలించెడి నీదు బుద్ధి వేదాంత
భావంబు వినుటచే పరమనిశ్చలన
భావమొందినదయి పార్థుండ పిదప
పా?కటజీవాత్మ పరమాత్మలకును
ఏకాత్మభావమే యెన్న సమాధి
ఆసమాధిని నెప్పుడచలమై యుండి
భాసిలునప్పుడు భాసురంబుగను

మునుపు జెప్పిన యోగమును బొందగలవు
అనుడర్జునుం డిట్టులనియె గృష్ణుగని
పలుమారు నీచెప్పబడిన సమాధి
నిలచియు బ్రహ్మంబునే నైతి ననెడి
చలనములేని ప్రజ్ఞాసమేతునకు
పలుకు లక్షణమేది బ్రహ్మంబునందు
మట్టుపడిన బుద్ధిమంతుం డేమనును
ఎట్టుల కూర్చుండు నెట్టులనడుచు
అనుడు కృష్ణుండిట్టులనియె నర్జునుని
తనకెడి ప్రత్యగాత్మ స్వరూపమున
తనయందె యెపుడు సంతసపడుచుండి
మనసుననున్న సమస్తంబులైన
తుచ్ఛకామంబుల దొలగించునపుడు
స్వచ్ఛచాంచల్య శూన్యప్రజ్ఞ గల్గి
అతడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును
ప్రతిభ నాధ్యాత్మిక ప్రముఖ దుఃఖములు
గలుగ భీతమనస్సు గలుగనివాడు
ఎలమి సుఖంబుల స్పృహలేనివాడు
మును రాగభయరోషములు లేనివాడు
మననశీలుడు స్థిరమతి యనంబడును
క్షమ సకల ప్రయోజనముల యందు

సమత నుదాసీనుసరణి స్నేహంబు
దనరనివాఁడు దత్తచ్ఛుభాశుభము
లొనరి సంతసపడఁడో ద్వేషపడఁడో
శుభమున మోదం బశుభమున ఖేద
మభినయింపక యెవ్వఁ డవికృతినుండు
నప్పూరుషుని బుద్ధి యఖిలకాలముల
జొప్పడియుండును సుస్థిరంబగుచు
ఎప్పుడు నీయోగి యింద్రియంబులను
తప్పక యింద్రియార్థంబులనుండి
అంతట కరచరణాద్యంగములను
ఎంతయు దాఁబేలు నిముడించుకొన్న
అట్టుల నిముడించు నప్పుడాయోగి
రాట్టు బుద్ధియె సుస్థిరంబుగానుండు
ఇంద్రియంబులచేత నింద్రియార్థముల
సాంద్రత గ్రహణంబు సలుపుచు నున్న
దేహాభిమాన సందీపితాజ్ఞునకు
మోహకారణ శబ్దముఖ విషయములు
అభిలాషతప్ప నొయ్యన బోవుచుండు
శుభపరమాత్మను జూచియున్నట్టి
ఈస్థిత ప్రజ్ఞుని కీప్సితంబేని
సుస్థితిగనక యచ్చుగ పాసిపోవు

బలవదింద్రియములు బ్రహ్మప్రాప్తి కొరకు
అలఘుత యత్నించునట్టి ధీరుడగు
పురుషుని మానసంబును బల్మిచేత
హరియించుచున్నవి యమరేశపుత్ర
ఆయింద్రియంబుల నన్నింటియోగి
పాయకపట్టి మత్పరుడగుచుండు
ఎవనికి వశములై యింద్రియావళులు
నివసించువాని మనీష సంతతము
ఆపరబ్రహ్మమందు ధనంజయుండ
చాపల్యమొందక సంస్థితింజెందు
విడదగు శబ్దాది విషయంబులెపుడు
నుడుగక చింతించుచున్న యాతనికి
ఆసక్తి యావిషయములందు బొడము
ఆసక్తి వలననే యభిలాష గలుగు
అభిలాషవలన జయ్యన కిన్క బుట్టు
అభివృద్ధమగు కిన్క నవివేక మొదవు
అవివేకమున గురూక్తార్థ విస్మృతియు
వ్యవధిలే కుదయించునట్టి విస్మృతిని
బుద్ధినాశంబగు బుద్ధి నాశమున
బద్ధుడై నశియించు భారతాన్వయుడ
పొడము రాగద్వేషములచేత విడువ

బడినవై తన మనోవశములై యున్న
ఇంద్రియంబులచేత నింద్రియార్థముల
తంద్రలేక భుజింపదనరుచునున్న
స్వవశమొందిన మానసము గల్గువాడు
ప్రవిమలత్వము గాంచి రాజిల్లగలఁడు
క్రమముగ విమలతగనిన యీయోగి
కమిత దుఃఖక్షయంబగు కల్లగాదు
కడు నిర్మలమనంబుగల పూరుషునకు
వడినిశ్చయ స్వరూపంబైన బుద్ధి
పొలుపొంది సుస్థిరంబుగ నిల్చియుండు
కలుషితేంద్రియ వినిగ్రహ విహీనునకు
జానుగ నాత్మవిషయ బుద్ధిలేదు
వానికి నాత్మభావనయును లేదు
వలనుగ బ్రహ్మ భావన లేనివాని
కలఘు చిత్తోపరత్యాప్తియు లేదు
చిత్తోపరతిలేని చెడుగున కెట్లు
హాత్తు బ్రహ్మానందమనెడు సౌఖ్యంబు
వివిధేంద్రియంబులు విషయంబులందు
దవిలిచరించుచు దనరనేమనము
బలిమినిపురుషుచే బంధింపబడక
చెలువుగ ననుసరించి చరింపుచుండు

ఆమనం బీపురుసాధము ప్రజ్ఞ
నోమక నీటియందోడను గాలి
కవిసీముంచునటు లాకర్షించుగాన
ఎవని యింద్రియముల నెల్లనంతటను
స్వవిషయంబులనుండి బంధింపబడునో
తివిరి యాతనిబుద్ధి తిరముగానుండు
ఏయాత్మవిషయమై మెసగెడి బుద్ధి
ఏయెడ బుద్ధిరహితులైన యెల్ల
ప్రాణులకు నగోచరంబౌట వలన
ఆనక నిశవలె నప్రభంబగునో
ఆయాత్మ విషయమింపగు బుద్ధియందు
కాయస్థితేంద్రియగ్రామ నిగ్రహము
ఏమరకుండ నెమ్యోడ జేయువాడు
తా మేలుకొనుచు నాత్మను జూచుచుండు
వృద్ధిగశబ్దాది విషయమానెట్టి
బుద్ధియందెప్పుడు భూతంబులెల్ల
జాగ్రతనుండు నాశబ్దాదివిషయ
కాగ్రియబుద్ధి నాత్మావలోకనము
తగజేయు ముని కవిద్యాస్వరూపంబ
యగుటరాతిరి రీతి నప్రకాశమగు
అన్య ప్రవాహతోయములెల్ల నదుల

మాన్యతోయమున నింపబడినదైన
మేరనెన్న డతిక్రమింపకయున్న
వారిరాశిని జేరు వైఖరినన్ని
అభిలాషలే యింద్రియ గ్రామనియమ
విభవసమేతుం బ్రవేశించుచుండు
ఆపురుషుండె బ్రహ్మైక్యంబునొందు
ఓపడు కామకుండొందనించుకయు
ఏపురుషుండైన నెల్లకామముల
నేపారవర్జించి స్పృహావిసర్జించి
మసలక యాత్మాభిమానంబు విడిచి
వెస మమత్వంబుతో విరహితుండగుచు
స్వీయ జీవనమాత్ర చేష్టావశేషు
డైయెప్డు చరియించు నప్పురుషుండు
ఓపి కైవల్యంబు నొందుచున్నాడు
ఓ పార్థయిదియె బ్రహ్మోద్భవనిష్ఠ
సడల కీబ్రహ్మనిష్ఠను పొందిమోహ
పడకుండు నీపరబ్రహ్మనిష్ఠయెడ
కాయావసాన తత్కాలమందైన
పాయకనిలిచి నిర్వాణంబునొందు
అని లోకమునకుగా హరితత్త్వమింద్ర

తనయు నిమిత్తమాత్రి మొనర్చి తెలిపె
అని ధృతరాష్ట్రునకా సంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీ సూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్స సగోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
శమదాయకంబైన సాంఖ్యయోగంబు
అనబడు నిదియు రెండవ తరంగంబు
దనగ నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితా నీక నిర్మలాలోక
గిహరాజ తేజ వేంకట శైలపాల.





శ్రీ ర స్తు.

# హరిసూక్తి తరంగిణి.

## కర్మ యోగము.

### తృతీయ తరంగము.

శ్రీదయాలేశ పూరిత సేవకాశ
వేదశీర్ష నివేశ వేంకటాద్రీశ
సవతులేని దయారస ప్రసారమున
నవధరింపు మదీయమైన విన్నపము
ప్రాగ్వోక్తమగు మాధవుని వాక్యసమితి
సర్వంబువిని క్రీడి జ్ఞానకర్మముల
అపవర్గ సాధకంబయిన దిద్దియని
సుపథంబుగ నెఱుంగు సూటివాటిలక
వాసుదేవునిజూచి వచియించెనిట్లు
వాసవవినుత పావన చిత్రచరిత
కర్మమూలకమైన జ్ఞానంబెసర్వ
కర్మంబుకంటె యోగ్యంబనినీకు
సమ్మతమేని భీషణ కర్మమునకు

పొమ్మనినన్నిట్లు పురికొల్ప నేల
తలప రెంటను మిశ్రితంబైన దాని
వలెనున్న సంశయాస్పద వాక్యమునను
పూనినాబుద్ధిని మోహింప జేయు
వానితీరున గానబడుచు నున్నావు
చేనిచే నేను ముక్తిని జెందగలనొ
కానమి నీజ్ఞాన కర్మంబులందు
దాని నానతియుమ్ము దగనిర్ణయించి
మానితకరుణ రమా మనోహరుడ
అనుడు నానగధారి యర్జునుంగాంచి
యనుకంప దీపింప ననియె నిప్పగిది
పనిగ నాత్మానాత్మ వస్తువివేక
మొనరువారికి జ్ఞానయోగంబు చేత
నిర్మలచిత్త సందీప్త యోగులకు
కర్మయోగము చేత గమనీయనిష్ఠ
ఇరు తెఱంగుల నిర్ణయించి చెప్పబడె
పురుషుడు యజ్ఞ ప్రముఖ కర్మములను
ఆచరింపనిచో గ్రియాశూన్యమనెడి
వాచకనిశ్చయ భావముంగనడు
దురితకర్మంబుల దొలగుటవలన
పురుషుల కాదర్శమున శుద్ధమైన

తనయందు నాత్మను దర్శించునట్లు
ఘనతరజ్ఞానంబు గలుగుచున్నయది
కనగ జ్ఞానములేని కర్మసన్న్యాస
మునను నైష్కర్మ్య విస్ఫుటసిద్ధిగనదు
క్షణమాత్రమైన నొకానొక డేని
అణుమాత్రమును కర్మ మాచరింపక యెం
వనియింపలేఁ డేయవస్థయందైన
ప్రసితుండవై విను పాండుకుమార
అదియుక్తమౌఁగదా యఖిల జనంబు
మొదట రాగద్వేష ముఖ్యంబులైన
ప్రాకృత గుణభేదంబముచేత నవశు
లై కర్మమొనరించు నవని నర్జునుఁడ
ఎవఁడు వాగాది కర్మేంద్రియంబులను
నవయక పట్టి మానస వృత్తిచేత
వెలయంగ శబ్దాది విషయంబులెల్ల
తలఁచుచునుండు నాతండవివేకి
యనియు మిథ్యాచారుఁడని జెప్పబడును
అనవధానుడవుగా కనఘ యాలింపు
పడలకెవ్వఁడు మదిజ్ఞానేంద్రియముల
నడగించి కర్మేంద్రియంబులచేత
కర్మయోగము ఫల కాంక్షలేకుండి

ఓర్మిగఁజేయు వాడుత్తముండగును
ఓ నరోత్తముడ జేయుము నీవు నిత్య
మైన సంధ్యావందనాది కర్మముల
ఇప్పుడర్జునుడ యే హేతువువలన
నొప్పుకర్మము సేయ నుడుగుటకంటె
స్వీయకర్మముచేత శ్రేష్ఠతరంబౌ
ఏమెడ కర్మంబులేవియు లేక
యమరునీకు శరీరయాత్రయుగూడ
క్షమ ప్రసిద్ధిని బొందజాలదు సుమ్ము
నిగమోక్తి వైఖరినిన్ ధనంజయుడ
భగవద్విషయ కర్మ వర్తనకంటె
ఇతర కర్మమునందు నీలోకజనుడు
తతముగ కర్మబంధన బద్ధుడగును
అలరి యాయజ్ఞార్థమైన కర్మమునె
అలవడు కర్మఫలాసక్తి విడిచి
పొలుపుగ నాచరింపుము సవ్యసాచి
జలజాసనుడు పూర్వ సర్గకాలమున
ప్రజలను యజ్ఞసంపదతో సృజించి
విజయుండ యాతడివ్విధమున బల్కె
ఈయజ్ఞమున బ్రజాసృష్టి జేయుండు
ఈయజ్ఞ మిష్టేచ్ఛలిడుగాక మీకు

జనులార యీసుయజ్ఞంబుచే నింక
ననిశంబు మీరలింద్రాది దేవతల
వృద్ధినొందింపుడు వేల్పులుమిమ్ము
వృద్ధినొందింతురు వృష్ట్యాదికముల
అన్యోన్య మభివృద్ధి నందించుకొనుచు
అన్యోన్యమునకు శ్రేయము నొందగలరు
యజ్ఞంబుచేత ప్రహర్షింపబడిన
యజ్ఞభుజులును హృద్యంబులైనట్టి
స్త్రీపశుధన సుతాదిక భోగములను
ఏపు మీరగ మీకు నిచ్చుచుండెదరు
వారిచేత నొసంగబడి యున్నయట్టి
భూరిమృష్టాన్నాది భోగంబులెల్ల
ఎవడీనిలింపులకిడక తానొకడె
తవిలి భుజించునాతడు తస్కరుండె
అమరు యజ్ఞముసేయ నవశిష్టమైన
యమృత మనంజను నన్నంబుదినెడి
శీలంబుగలయట్టి శ్రేష్ఠపూరుషులు
వైళంబుగ నశేష పంచసూనాది
వృజిన వ్రజముచేత విడబడుచుంద్రు
విజయుడ నూరుట విసరుటమఱియు (యయు
ఉడుక గాచ్చుటయు గోయుటయు నూడ్చుట

ఎఱుగు మీస్నానంబు లేనని గృహిణి
అఱుమనీవు సురాలయము వానినివియ
మఱువక యుండుమీ మానసంబందు
భువియందు స్వోదర పూరణంబునకు
ఎవరు పాకము పచియింతురో యట్టి
వారు పాపాత్ములు పాపపుంజములె
వారుభుజించెడి వారు ఫల్గునుడ
అన్నముచే బ్రాణులవని బుట్టుదురు
అన్నంబుబుట్టు వర్షాధిపువలన
యజ్ఞంబువలన వర్షాధిపుడగును
యజ్ఞంబు కర్మమునందు జనించు
నిగమంబువలన జన్మించుకర్మంబు
తగుశ్రుతి యక్షరోద్భవమంచు నెఱుగు
కావునశ్రుతి యెల్లకతల వ్యాప్తమయి
యేవేళయజ్ఞమందే యుంచబడియె
పొరిపొరినెవ్వడీ పూర్వోక్తరీతి
స్థిరతబ్రవర్తింపఁ జేయంగబడిన
సలలిత మీజగచ్చక్రంబు నిచట
వలనుగ దా ననువర్తింపకుండు
అతడు పాపాయుషుడై యింద్రియార్థ
తతిసక్తుడగుట వ్యర్థము వానిబ్రతుకు

ఎవడో ళతనయందునే తృప్తుడగునో
అవిరత మాత్మయం దాసక్తుడగునో
తనయందునే ప్రమోద పడునో యట్టి
కనదాత్మవిదునకు గార్యంబులేదు
పరికింప నాపరబ్రహ్మ నిష్ఠునకు
ఘోరికర్మమొనరింప పుణ్యంబులేదు
త్యజియింప బ్రత్యవాయం బొందులేదు
విజయుండ యీబ్రహ్మవేత్తకు నెప్డు
సకల భూతములందు స్వప్రయోజనము
సుకరత్వమునకు నించుక యాశ్రయంబు
ఏదియు లేదది హేతువువలన
కాదనకర్జున కార్యకర్మముల
సలుపుము ఫలముల సంగంబులేక
ఫలసంగరహితుడై భవ్యకర్మమును
సలిపిన జనుడు మోక్షము నొందగలడు
వలదిక సందేహపడ దీనియందు
జనకాదులైన రాజర్షులు మున్ను
ఘనముగ నిష్కామ కర్మంబుచేత
స్థిరచిత్తపరి శుద్ధిజెందిరి గాన
కరమునీవునిక లోక ప్రయోజనము
కనుచున్నవాడవై కర్తవ్యకర్మ

మొనరింపదగుదు వత్స్యాత్సాహ గరిమ
ఇలబ్రహ్మవేత్త యేయేకర్మ మెలమి
సలుపునోయయ్యది సలుపుబామరుడు
ఎదిప్రమాణము జేయునెప్పుడు నాజ్ఞాని
అదిప్రమాణముజేయు నజ్ఞానిగూడ
నాకొనరింపగన్ దగినకర్మంబు
లోకమందేది యాలోకింపలేదు
ముందునాచేతను ముల్లోకములను
బొందబడనిదియున్ బొందదగినది
ఐనదెద్దియును లేదావంత యేని
ఐనను గర్మమందవసించియుంటి
మత్తుడగాక కర్మమునందు నేను
ఒత్తుగ వర్తింప కుండితినేని
నరులన్నివిధముల నాదుమార్గమును
వరుసదప్పక యే ప్రవర్తింపుచుండు
ఉముగక కర్మమే నొనరింపకున్న
చెడిపోదురీజనుల్ సిద్ధంబుపార్థ
గాన నే వర్ణసంకర కర్తనౌదు
దానసర్వప్రజాధ్వంసినేనౌదు
అవిరతంబును కర్మమందు సక్తులయి
అవివేకు లొనరించునట్లు కర్మమును

ప్రజలయు న్మార్గ ప్రవర్తనం బెల్ల
విజయ మాన్పుటను గావింపగాదలపు
గనిన యాత్మజ్ఞుడు కరమసక్తుడయి
ఒనరింపగాదగు నూఱకుండకయె
అవని పండితుడు కర్మానురక్తులగు
అవివేకజనుల కర్మాత్యంతసక్తి
గనిన బుద్ధి చలింపగా జేయదగదు
అనవధానత మాని యాచరించుచును
స్థిరతకర్మములెల్ల జేయింపవలయు
సురరాజసుత విను సూటిగా మఱియు
తగని యహంకార ధర్మంబుచేత
తగుతెల్వి లేని చిత్తముగల్గువాడు
ప్రకృతిసంజాత కార్యకరణరూప
సకలేంద్రియములచే సరవిగవాని
వికృతులచేతను వివిధరీతులుగ
ప్రకటంబుగ నొనర్పబడిన కర్మముల
నేనె చేసితినని నిత్యంబుదలచు
జ్ఞానవంతులతోడ సంగంబుగలిగి
తత్త్వంబుదెలియ నుత్తముడైన యెడల
సత్త్వాదిగుణముల సంతతిన్ వాని
కర్మంబులన్ విభాగపు వేళయందు

పేర్మి నింద్రియములు విషయంబులందు
చరియించునని యెంచి సక్తుండుగాడు
పరమాత్మ తత్త్వంబు పరికించుచుండు
ప్రకృతిజన్యములు సత్త్వముఖంబులైన
సకలగుణంబుల సమ్మూఢులగుచు
ఎవరింద్రియంబుల నింద్రియార్థముల
నవిరతం బాసక్తులగుచు నుండెదరో
స్వైరమందులయి సర్వజ్ఞులుగాని
వారల బుద్ధిసంపద సంచలించి
తొలగిపో నాత్మవిదుండైనవాడు
సలుపగూడదు సుమ్ము సత్యప్రతాప
మానక సర్వకర్మములు నాయందు
జానుగనునిచి సుజ్ఞానబుద్ధిమెయి
మహిని నిష్కామివై మమకారముడిగి
విహితకార్యంబని విగతతాపమున
కాదనకింక సంగ్రామంబొనర్పు
నాదు కార్యంబున నమ్మికగల్గి
ఏమి యసూయ నాయెడలేనియట్టి
ఏమానవులు ప్రీతినీ నామతంబు
వారలెప్పు డనువర్తించుచుండ్రో
వారెల్లరును పుణ్య పాపస్వరూప

కర్మబద్ధులుగారు కౌంతేయవీర
శర్మద మీమదాశయ మొకింతయును
ఎవరసూయను నాశ్రయింపకుండెదరో
అవివేకులు నశేషమగు జ్ఞానమందు
పరమమూఢులునైన వారినినీవు
పరికించిచెడినట్టి వారిగాదెలియుము
మిగుల జ్ఞానముతోడ మెలయువాడైన
స్వగత జన్మాంతర సంస్కారమునకు
సరిగవర్తించును సర్వభూతములు
వరుసగ స్వస్వభావము నొందుచుండు
గాననింద్రియ వినిగ్రహము నాజ్ఞయును
జేసి చేయఁగజాలు దివిజేంద్రపుత్ర
ప్రమదమిష్టమున వైరమనిష్టమందు
రమణన్ ప్రతీంద్రియార్థములందు గలవు
ఏనిదానంబున నీపూరుషునికి
పూనిరాగద్వేషములు మోక్షగతికి
అంతరాయములైన యరిపక్షములుగ
అంతటనెంతురో యానిదానమున
విశసించునారాగ విద్వేషములకు
వశుడుగాగూడదు పాండురాట్తనయ
ఓపి సద్వ్యాగీత్రి నొనరింపబడిన

'స్వాపర వర్ణాశ్రమాచారముఖ్య
ధర్మంబుకంటె నింద్యంబైనస్వీయ
ధర్మంబు శ్రేష్ఠంబు తనధర్మమందు
మరణమైనను భవ్యమార్గంబు జూపు
పరధర్మము నరక భయము నొందించు
అనవుడు పార్థుండు హరి కిట్టులనియె
వనజాక్షపురుషుండు పాపంబుజేయ
ఎద నిచ్ఛలేకపోయిన బల్మివలన
ఎదికారణంబున భృత్యునిరీతి
ప్రేరితుండగుచు దుష్కృత మాచరించు
కారుణ్యమున దెల్పు కమలపత్రాక్ష
అనిన విన్వచ్చున కనియె కృష్ణుండు
అనఘ యాకర్ణింపు మదివచించెదను
ఇవుడు నీవడిగిన యికారణంబు
చపల రజోగుణజంబు కామంబె
ఈకామమొకనిచే నెడల కొట్టబడి
పోక్రోధాకారమున వికారించు
అధిక భక్షణమైన యది పాపరూప
మదిగాన నీకామమకట యీమోక్ష
గతియందు వైరిగా నెరుంగు పార్థ
సతతంబు నేరీతి సహజ ధూమమున

జ్వలన తేజము గప్పబడునో యేరీతి
మలినత నద్దంబు మరుబడు నెట్లు
మావిచే గర్భంబు మాగ్పడియుండు
ఆవిధంబున నమ్మహా కారణమున
అరయ నీజ్ఞాన మావృతంబయ్యె
పూరింపగ నశక్యముగ నున్నదియును
చాలిమిలేక యిచ్ఛా స్వరూపంబు
వాలాయమును జ్ఞానవంతుని కరియు
ఐన యిక్కామ మాయతశక్తిచేత
జ్ఞాన మావృతమయ్యె గాండీవివినుము
మొనసిన యిక్కామమున కధిష్ఠాన
మెనయు మనోబుద్ధు లింద్రియంబులును
ఈయింద్రియములచే నీహేయకామ
మాయతజ్ఞానంబు నరికట్టియుండు
దేహిని పెక్కైన తెఱగులచేత
మోహింపజేయును పూనికతోడ
కావున నింద్రియగ్రామనిగ్రహము
కావించి ముందుగ కౌంతేయనీవు
అనయమాత్మజ్ఞాన మనుభవజ్ఞాన
మునుదుల్చునది పాపమూర్తియునైన
ఈకామముం ద్యజియింపు లెస్సగను

కైకొనుమీబుద్ధి కడునిష్ఠమెయిని
అలఘుపండితులు శ్రోత్రాదింద్రియములు
కలిత దేహాదులకంటె శ్రేష్ఠములు
అని చెప్పుచుండెదరట్లు మానసము
ఘన మింద్రియంబులకంటెను బుద్ధి
మానసంబునకంటె మానితంబాత్మ
మానిత నిశ్చయాత్మక బుద్ధికంటె
వ్యతిరిక్తమగు సాక్షిభావంబుచేత
అతులిత స్థితినున్న యదిపరమాత్మ
ప్రతిభతో నీప్రకారము బుద్ధికంటె
వ్యతిరిక్తమై యున్న యాత్మ నెరింగి
మనసును నాత్మచేమరి నిగ్రహించి
ఘనదుఃఖమున బొందగల కామరూప
వైరిసంహారంబు వారకజేసి
పారమార్థికవృత్తి బడయు మర్జునుడ
అనుచు నర్జునుగూర్చి యతులితాదరము
గనుపింప బోధించె గరుడకేతనుడు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్త్ర

వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్రి
కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
క్రమసమీరితమైన కర్మయోగంబు
అనబడునిదియె మూడవ తరంగంబు
దనర నీకిది యర్పితంబానుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.



శ్రీ ర స్తు.

# హరిసూక్తి తరంగిణి.

## జ్ఞానయోగము.

### చతుర్థ తరంగము.

శ్రీవేంకటనగాక భృతభక్తలోక
ఆవాసితశ్రీక యవధరింపుమిక
ధీనిధివైన కౌంతేయు నీక్షించి
జ్ఞానచిత్తవిహారి శౌరి యిట్లనియె
ఆదియం దవ్యయంబైన యీయోగ
మాదివాకరున కేనదుగఁజెప్పితిని
వనరుహాప్తుడు వైవస్వతుండనెడు
మనువునకుంజెప్పె మరల నామనువు
వచియించెనిక్ష్వాకు వసుమతీపతికి
ప్రచురమయ్యెఁ బరంపరా ప్రాప్తినిట్లు
నిమిముఖ్యరాజర్షి నివహంబు దీని
క్రమమెఱింగి రనంతరము కాలమమిత
మైననీలోకమందది నష్టమయ్యె
జానుగ విచ్ఛిన్న సంప్రదాయమయి

భక్తుండవనినాకు వరసఖుండవని
ప్రోక్తమైనది యిద్ది యోగంబునీకు
ఓపార్థయిదితొంటి యోగంబెసుమ్ము
జ్ఞాపితంబిది రహస్యం బనుత్తమము
అనుఁడు పార్థుఁడు సంశయావిష్టుఁడగుచు
ఘనవిధేయత కృష్ణగని వాసుదేవ
భవదీయజన్మంబు ప్రకృతమైయుంటె
సవితృని జన్మంబు సర్గాది నయ్యె
అతనికీవీయోగ మానతిచ్చితని
మతినెట్లునమ్ముదు మాధవాయనిన
వనజలోచనుఁడిట్లు వచియింపఁదొడగె
వినుము నేవివరింతు విజయ యిప్పటికి
నీకును నాకు ననేక జన్మములు
దాకొని క్రమశీలత నతిక్రమించె
ఏనెఱుంగుదువాని నెల్లతెల్లముగ
ఈనీవెరుంగలేవివి పరంతపుడ
భయదజన్మములేని వాడనైయుండి
వ్యయముగానని స్వభావంబు గల్గియును
స్వయముగా బ్రహ్మాది సకలభూతముల
నియమించువాడనై నిజమాయయందు
నివసించి నేనుదానికి లోనుగాక

అవతరించుచునుందు నాత్మీయమాయ
ఎప్పుడెప్పుడు ధర్మహీనమౌచుండు
నెప్పుడెప్పు డధర్మవృద్ధియౌచుండు
అప్పుడప్పుడు భూమి నామాయచేత
దప్పక సృజియించెదను నన్నునేను
సుకృతసంగతుల శిష్టులనురక్షింప
సుకృతాన్యరతుల దుష్టులను శిక్షింప
ప్రతియుగంబందు ధర్మంబునిల్పుటకు
క్షితియందు నవతరించెదఁ బాండవేయ
అప్రాకృతమును మాయారూపమైన
నాప్రకృష్టతర జన్మప్రకారంబు
ధన్యావనాది మత్కర్మప్రకార
మిన్యాయమైన చెయ్ది యథార్థముగను
ఎవడెఱుంగునో యాతఁడే మేనువిడిచి
భువి పునర్భవ మొందఁబోడు నన్నొందు
కను కెంపు వెరపు రాగము నుజ్జగించి
నను నాశ్రయించుచు నాస్వరూపముగ
పరిణమించిన మనః పరమవృత్తులయి
ధరననేకులు జ్ఞానతపముచే నిత్య
పరిశుద్ధులైనాదు ప్రకృత్యతురూప
మరసి పొందిరి పూర్వమందు ఫల్గునుడ

ఏరీతి నెవరు నన్నెఱుఁగు చుండెదరొ
వారినట్లు ననుగ్రహించు చుండెదను
మనుజులు పార్థ సమస్తవైఖరుల
ననుసరించుచునుందు రస్మదీయగతి
కర్మధామ నరలోకమున వేగముగ
కర్మజఫలసిద్ధి ఘటియించు గాన
నిజకర్మ ఫలసిద్ధి నెరిగోరి జనులు
యజయింతురిందె యింద్రాదిదేవతల
సురరాజతనయ యీక్షోణిపైతొల్లి
గురుకర్మ సత్వాది గుణ విభాగముగ
నాచేద్విజాది వర్ణచతుష్టయంబు
ఏచిధనంజయ సృజియింపఁబడియె
వానికిగర్తనై వరలుచునుందు
నైన నకర్త నవ్యయుగ నన్నెఱుఁగు
రావు సృష్ట్యాది కర్మములు నన్నంట
ఆవంత కర్మఫలాశ నే నెఱుఁగ
ఈతెఱంగున నన్ను నెవ డెఱింగెడినొ
యాతడు కర్మసంహతిఁ గట్టుబడడు
పొలుపుగ నీవిధంబు నెఱింగి మున్ను
గల ముముక్షువులచేఁ గర్మ మెంచఁబడె
నదిగాన మును జనకాదిష్టమైన

యది పురాతన కర్మమయొనర్పనీవు
కర్మమెట్టి దకర్మకలన మెట్టిదని
పేర్మి మోహితులైరి విబుధులునిందు
ఏకర్మ మెఱిఁగి కీడెనయకుండెదవా
యాకర్మ మెఱుఁగ నీకరసి చెప్పెదను
కడక కర్మాకర్మక వికర్మములయు
కడిమి నెఱుంగుట గహనంబు గాన
మహిశాస్త్రవిహిత కర్మముయొక్క నిజము
ప్రహితంబుగ నెఱుంగవలసియునుండె
ఒగి దూష్యకర్మంబు యొక్కయు నిజము
తగువారి కధిక బోద్ధవ్యముం గలదు
క్షితికర్మరహిత తూష్ణీంభావమందు
నతుల తత్త్వమెఱుంగ నగునది గలదు
సకలేంద్రియ క్రియా సద్భావమందు
నకలంకముగ సాక్షినై యున్న తనకు
ఎవ డకర్మత్వంబు నీక్షించుచుండు
తవుల బ్రహ్మంబు జ్ఞాతంబగుచుండ
దనకుఁగాఁ జేయంగఁ దగిన కర్మంబు
దనరగ్కృతంబని దర్శించునెవఁడు
ధరవాఁడు నిశ్చయాత్మకబుద్ధి యుతుఁడు
మరియు సమస్త కర్మకరుండు వాఁడె

యోగినాఁబడును మర్త్యులయందు వాఁడె
ఈగతి నెప్పుడు నీక్షించు నెవని
కర్మంబులెల్లను కామసంకల్ప
నిర్ముక్తములయి రాణించుచునుండు
ప్రకటితజ్ఞాన పావకదగ్ధమైన
సకల శుభాశుభాశ్రయ కర్మములను
కలుగు సత్పురుషునొక్కని బ్రహ్మవిదులు
పలుకుచునుందురు పండితాగ్రణిగ
ఎడపక కర్మ కర్తృత్వాభిమాన
మడచియు విషయంబులందును కర్మ
ఫలమునందును గర్తృ భావంబుఁగోర్కె
కలితాభిమానంబు గానకయుండి
జ్ఞానంబుచేతను సంతృప్తుడగుచు
ఆనిక లేనివాడయి కర్మమందు
వర్తించుచుండిన వాఁడయ్యునతడు
కర్తనాఁబడకుండు కాసంతయేని
పొరలేదు నిజచిత్తమును బాహ్యకార్య
కరణ సంఘాతంబు కడిమినిర్జించి
అఖిలవస్తు పరిగ్రహంబువర్జించి
నిఖిలాశ లుడిగి ప్రాణిక తనుస్థితికై
యుపయోగమగు కర్మమొనరించు జనుడు

ఎప్పుడును ఘోరసంసృతి బంధరూప
దురితంబు బొరయఁడు దూరీకృతారి
పరులయాచింపక బడయులాభమున
పరితుష్టినొంది ద్వంద్వములెల్లఁగడచి
పరిహృతమత్సరభావంబుబూని
చిరయదృచ్ఛాలాభ సిద్ధికాలమున
యరయదాని యసిద్ధిమైన కాలమున
సముఁడైన జనుడు కర్మములు చేసియును
భ్రమరూపసంసార బద్ధుండు గాఁడు
సంగంబుజెందక సంసారబంధ
సంగతి నెడబాసి జ్ఞానమందున్న
స్వాంతంబుగలవాఁడు యజ్ఞంబుకొఱకు
సంతతంబును లోకసంగ్రహార్థంబు
కర్మముచేసిన ఘనునికి సఫల
కర్మమెల్ల నశించు కౌంతేయవినుము
బ్రహ్మంబె హోమకారణ సాధనములు
బ్రహ్మంబె గోఘృత ప్రముఖహవిస్సు
బ్రహ్మాగ్ని కర్తృరూపకమైన యట్టి
బ్రహ్మంబుచేతను బ్రహ్మంబె హుతము
బ్రహ్మకర్మమున స్వరసమాధిచేత
బ్రహ్మమే గంతవ్య ఫలమందు తెలివి

పొందిన వానికెప్పుడు కర్మమేది
కొందఱు కర్మయోగులు దేవయజన
సాధనమైన యజ్ఞమునే ఫలేచ్ఛ
సాధుతరంబుగ సలుపుచుండెదరు
ప్రాజ్ఞులు కొందఱొప్ప హవిస్స్రుగ్వాది
యజ్ఞసాధనముచే నతిపరమార్థ
పరివృతాత్మను పరబ్రహ్మాగ్నియందు
విరజస్సమాధిచే వ్రేల్చుచుండెదరు
కొంద ఱుత్తమ నైష్ఠికులును శ్రోత్రంబు
ముందగు నింద్రియంబుల నిగ్రహమను
సందీపితాగ్నులజాడ వ్రేల్చెదరు
కొందఱు శబ్దాది గురువిషయముల
కుందక యింద్రియాగ్నుల వ్రేల్చుచుంద్రు
కొందఱొనర్చు భంగులు పార్థవినుము
జ్ఞానకర్మేంద్రియౌఘ విషయంబులను
ప్రాణాది దశ మరుద్వ్యాపారములను
జ్ఞానరూపేంధన సమితి సందీప్త
మౌనిజాత్మ యమయోగాగ్ని వ్రేల్చెదరు
పుడమిని గొందఱు పుణ్యతీర్థముల
తడయక ద్రవ్యప్రదాన యజ్ఞమును
చపలతవిడి కృచ్ఛ్ర చాంద్రాయణాది

తపమను యజ్ఞముత్తములు కొందఱును
ఆపోవ ప్రాణసంయమనాదియోగ
రూపయజ్ఞము నొనర్తురు గొందఱనఘ
స్వాధ్యాయ పారాయణాఖ్య యజ్ఞమును
సాధ్యశాస్త్రార్థ విజ్ఞాన యజ్ఞమును
యజియింత్రుకొంద ఱాయ్యాన కొందఱరయ
సజవ జితేంద్రియుల్ సంశితవ్రతులు
లలయక కొందఱు ప్రాణమువృత్తి
నల యపానము వృత్తియందు వ్రేల్చెదరు
వలనుగ కొందఱపానమ్ము వృత్తి
నలరి ప్రాణము వృత్తియందు వ్రేల్చెదరు
రేచకపూరక వృతకుంభకముల
నాచరింపఁగల ప్రాణాయామమందు
నమరెడివారు ప్రాణాపానగతుల
క్రమముగనరికట్టి కడఁకవ్రేల్చెదరు
పరిమితాహారులై పరగుకొందఱాగి
పొరలు వాయువిశేషములను బూర్వంబు
స్వవశీకృతములైన వాయువులందు
నవియుక వ్రేల్చుచున్నారు ఫల్గునుఁడ
ఈయుక్తమైన వారెల్ల యజ్ఞవిదు
లైయజ్ఞ దూరీకృతాఘులై యుందురి

ధర యజ్ఞశిష్టామృతంబు భక్షించు
పురుషులు బ్రహ్మంబు బొందుచుండెదరు
మునువచించిన యజ్ఞముల నొక్కటేని
నొనరింపనోపక యున్నమర్త్యునకు
అరయమీలోకమే ప్రాప్తింపకుండు
పరలోక మెబ్భంగిఁ బ్రాప్తించుఁ బార్థ
క్షితినిట్లు బహువిధాకృతుల యజ్ఞములు
శ్రుతిముఖంబుననె విశ్రుతములై యుండె
గనుము వానినినెల్ల కర్మజంబులుగ
పొనరనిట్టులెఱింగి ముక్తుండవగుదు
జ్ఞాన యజ్ఞము ద్రవ్యసాధన సాధ్య
మైన యజ్ఞముకంటె నగును శ్రేయంబు
చిరకర్మమెల్ల నశింపకుండియును
పొరయు బ్రహ్మజ్ఞానమున సమాప్తమగు
అకలంక తత్త్వజ్ఞులగు జ్ఞానవంతు
లొకట నీకేజ్ఞాన ముపదేశసరణి
అడరించెదరొ దాని సాష్టాంగవినతు
లిడుటచే నెఱుఁగని వెల్లభాగముల
చొప్పడుగుటచేత శుశ్రూషచేత
గొప్పగాఁదెలియుమీ కురువంశవర్య
పిజ్ఞానము నెఱింగి యికయిట్టిమోహ

మజ్ఞుండవై మెప్పు డొందకుండెదవొ
ఏజ్ఞానమహిమచే నెల్లప్రాణులను
ప్రజ్ఞ చేనీయందఁ బరికింపగలవొ
ఆయనంతరము బ్రహ్మస్వరూపుండ
వైయున్న నాయంద యటుచూడగలవు
పాపాత్ములగు నెల్లవారల కంటె
పాపమెక్కుడొనర్చు వాడవై యున్న
నీవొక్క జ్ఞానంబనెడి తెప్పచేత
తావక కిల్బిషోదధి దాటగలవు
పొండవేయ జ్వలించు వహ్నికట్టియల
మండింపఁజేసి భస్మమొనర్చునట్లు
జ్ఞానాగ్నిహోత్రంబు సర్వకర్మముల
మానక గాల్చి భస్మముగా నొనర్చు
జ్ఞానంబుతోడను సాటిపవిత్ర
మైనది యీలోకమందెందులేదు
విహిత యోగాభ్యాసి పెక్కుకాలమున
మహాసిద్ధుడై తనమది జ్ఞానమొందు
తగశ్రద్ధధానుడై తత్పరుండగుచు
నిగృహీత చంచలేంద్రియుఁడైన నరుడు
జ్ఞానంబునొందును జ్ఞానంబునొంది
మానితంబగు శాంతి మరివేగమొందు

జ్ఞానహీనుడును విశ్వాస హీనుండు
మానస సందేహి మనుజుండు చెడును
ఎందును సందేహ వృతమానసుండు
ఇందునందును జెందఁ డేమేలుగనఁడు
విమలయోగంబున విడువంగఁ బడిన
అమిత కర్ముఁడయి బ్రహ్మజ్ఞానరూఢి
ఛిన్న సందేహుఁడై స్థిరమనస్కుఁడయి
సన్నుతిగను వాని సర్వకర్మములు
బంధింపనేరవు పాండవోత్తముడ
అందున సుజ్ఞాన మనెడిఖడ్గమున
అవివేక సంజనితాత్మ సంశయము
ఇవమున ఖండించి జ్ఞానయోగంబు
అనుసరించి యొనర్పు మడలకీవిపుడు
అని జేయ లెమ్ము సయ్యాన యర్జునుండ
అనుచు మురారి దయారసం బొలుక
గనుచు పార్థునకు నిరూపణొనర్చించె
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్రి

కనదంద్రకంటి వేంకటశాస్త్రి కృతము
వమ హరిసూక్తి తరంగిణి యందు
సమధి కేష్టదమైన జ్ఞానయోగంబు
అనబడు నిదియె నాల్గవ తరంగంబు
ధనర నీకిది యర్పితంబౌను గాత
నిహతా హితానీక నిర్మలాలోక
గ్రహా రాజతేజ వేంకట శైలపాల.



శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

కర్మసన్న్యాస యోగము.

పంచమ తరంగము.

శ్రీస్తుతచరణ వైరికదంబహరణ
కౌస్తుభాభరణ వేంకటశైల శరణ
నీదయారస దృష్టినెఱయ జేయుచును
నాదగుమనవి పూర్ణముగ నాలింపు
గాండీవి కృష్ణునిగని యిట్లులనియె
పుండరీకాక్ష సత్పూరుషపక్ష
ప్రాగుక్త శాస్త్రీయ వరకర్మములకు
త్యాగమన్నరల శాస్త్రప్రోక్తమైన
కర్మయోగమ్ము పల్కఁబడె నీచేత
కర్మదమీ రెండు సరణులందొకటి
ఏదియో దానిని దృఢముగా జెపుము
ఆదటనన కిరీటి కసురారియనియె
కర్మపరిత్యాగ కరణంబునాఁడియు

కర్మయోగము రెండు కైవల్యదములె
ఆరెంట కర్మ సన్యాసంబుకంటె
గౌరవమైనది కర్మయోగంబు
పొలుచు రాగద్వేషములు లేనివాడు
బలమైన సంసార బంధంబువలన
నతిసులభంబుగా నధిక వేగమున
నతులిత మోక్షంబు నందునుగాన
ఏదియు ద్వేషింప కేదియుగోర
కేదోషమునులేక యేకర్మయోగి
నిలుచునో యాతడు నిత్యసన్యాసి
బలవైరిసుత మఱి వచియింతువినుము
కర్మసన్యాసంబు కర్మయోగమును
పేర్మిభిన్నములంద్రు వృధమూఢ జనులు
జ్ఞానవంతులు జెప్పజాలరప్పగిది
గాన నీసాంఖ్యయోగముల రెండింట
నొకదాన లెస్సగ నున్నవాడేని
ప్రకటంబుగా రెంటి ఫలమొందగలడు
ఘను జ్ఞానవంతు లేస్థానమొందెదరో
శ్రమకర్మయోగు లాస్థానమొందెదరు
గాన జ్ఞానంబును కర్మయోగమును
ఏనరు మొకఫలంబే యిచ్చుననుచు

గనునో యాతడు లెస్సగ నెఱుంగువాడు
అనిమిష ప్రభుపుత్ర యాలింపు మఱియు
కర్మయోగంబు లేకయె పరమార్థ
ధర్మమొందుటకు ఖేదము నిమిత్తమగు
ఘనతర కర్మయోగసమేతుడైన
మననశీలుండు బ్రహ్మము నొందు వేగ
ఉరుగుణ నిజకర్మ యోగయుక్తుండు
పరిశుద్ధచిత్తుండు ప్రజిత దేహుండు
వ్యాకృతేతరుడు బ్రహ్మాది భూతముల
యాకృతియగు ప్రత్యగాత్మరూపంబు
గలవాడు నింద్రియగ్రామ నిగ్రహము
గలపూరుషుడునైన ఘనుడు కర్మముల
జేయుచున్నను వానిచే నంటబడడు
ఏమెడను యథార్థ మెఱిగినవాడు
కనుచును ముట్టు చాఘ్రాణించుచుండి
తినుచును గన్నులు దెఱచుచున్ వినుచు
విడుచుచు నిట్టూర్పు విడుచుచున్ గొనుచు
నుడువుచు కన్నుల మ్మూయుచు నుండి
నడుచుచు గూర్చుండుచు సర్వేంద్రియములు
తడయక యింద్రియార్థములందు మెలగు
నని నిశ్చయించు వాడయి యుంచు కేని

పనియు నేనాచరింపగ లేదటంచు
ప్రవర సమాహిత స్వాంతుడై తలచు
ఎవడు ప్రాప్తమునందు నెల్లకర్మముల
నిలిపి ఫలాసక్తినిఁ బరిత్యజించి
సలుపునో యాతండు సలిలంబుచేత
వనజ పత్రమువలె పాపంబుచేత
తనుకంగబడడు పృథాతనూజాత
స్థిరకర్మయోగులు చిత్తశుద్ధికయి
పరిపాటి ఫలకాంక్ష పారంగద్రోలి
అఱరు దేహమున స్నానాదికర్మమును
అలమానసమున ధ్యానాది కర్మమును
అలఘు బుద్ధిని నిశ్చయాది కర్మమును
నెలకొను కేవలేంద్రియరాజిచేత
శ్రవణాది కర్మముల్ సలుపుచునుంద్రు
వివిజేంద్రతనుజ సుస్థిరవృత్తిబూని
గురుసమాహిత మనస్కుడు కర్మఫలము
పరిహరించి పరాత్మపర నిష్ఠయందు
పొసగిన శాంతిని బొందుచున్నాడు
అసమాహిత స్వాంతు డభిలాషచేత
అతికర్మఫల సక్తుడై గట్టబడును
జితసకలేంద్రియ స్థితిగల్గువాడు

మనసుచే స్వకృత సమస్త కర్మముల
ననువుగ దొమ్మిది ద్వారంబులున్న
పురముబోలిన దేహమున జేరవిడిచి
ధరను జేయింపక తాను జేయక సు
ఖానర ననాయాసముగనుండు ననఘు
జనునకుం బరమాత్మ జగతి నెన్నడును
కర్మంబులైనను కర్తృత్వమైన
కర్మఫలంబుల కాంక్షయునైన
సృజియింప డిక మఱియేమన్న వినుము
ప్రజలస్వభావంబె వర్తించుచుండు
ఓపిన యాత్మ యొండొకభక్త జనుని
పాపమేనియు బుణ్యపటలమేన్గొనడు
అజ్ఞానమున జ్ఞానమావరింపబడు
ప్రజ్ఞావిహీనులు ప్రాణులందఱును
అతిమోహపడుదు రాయజ్ఞానమునన
సతమాత్మవివరణజ్ఞానంబుచేత
నరయ నేజనుల యాయజ్ఞానమెల్ల
పరిహృతంబుగ జేయబడునో వారలకు
బరగు జ్ఞానము సూర్యుపగిది జ్ఞాతకును
పరమైన పరమాత్మవస్తువుంజూపు
పరిచితజ్ఞానంబువలన నిర్ధూత

దురితముల్గలవారు దుర్లభ్యమైన
ఆబ్రహ్మమందె సంప్రాప్తబుద్ధులయి
ఆబ్రహ్మమే స్వకీయ స్వరూపులయి
ఆబ్రహ్మమందునే యభినివిష్టులయి
ఆబ్రహ్మమే స్వగమ్యస్థానులయి
క్రమపునరావృత్తిరహిత మోక్షమును
క్షమమున గాంతురు కౌంతేయవినుము
వినయవిద్యలుగల విప్రునియందు
వినుతధేనువునందు ద్విరదంబునందు
శునకంబునందును శునకంబువండి
తినుచుండునీచజాతీయునియందు
ఉడుగని సమదృష్టియుతులు పండితులు
సడలకెవ్వరిమానసము బ్రహ్మసదృశ
భావమందచలమై పరగునోవారు
పావనులై పునర్భవము నిద్ధరనె
వడిగెల్తురెందుచే బ్రహ్మంబుదోష
మెడలినదో యది హేతువుచేత
ఆసమదర్శులాయ్యన బ్రహ్మమందు
భాసిల్లుచుందురు పాండుతనూజ
సందియమొందని సద్బుద్ధియుతుడు
విందును మోహంబు నెఱుగనివాడు

అగు బ్రహ్మవిదుడు బ్రహ్మమునందునుండి
ఒగి ప్రియంబును బొంది యుబ్బడెప్పుడను
ఉలికి యప్రియ మొందియును భయింపడను
వెలిబుట్టు శబ్దాది విషయంబులందు
ఆత్మని మనసుతో నమరువాడగుచు
చిత్తవృత్తినెవండు స్థిరతనే సుఖము
బడయుచుండునో వాడు బ్రహ్మంబునందు
కడు నిర్మలాంతరకరణంబుగలిగి
చెడని యానందంబు జెందుచునుండు
అడరెడి విషయేంద్రియంబులనుండి
పొడమిన యేసుఖంబులు హృషీకములు
ఒడగూడియుండుట యుడిగిపోవుటయు
గలవా యావిషయభోగములు బాధలకు
నెలవులౌటను బ్రహ్మనిష్ఠుడావిషయ
భోగంబులందు లిప్తుడుగాడు పార్థ
భోగలదేహంబు పోవుటకంటె
మునుపుగా నీలోకముననే జనుండు
మొనయు కామక్రోధములనుండి పొడము
వేగంబు సైప బ్రవీణుండో వాడు
సేగి వొందనివాడు చిరజితేంద్రియుడు
అంతరాత్మమున సౌఖ్యము గల్గువాడు

అంతరారాముండు నాంతరజ్యోతి
గలవాఁడు నెవఁడో యాఘనయోగి బ్రహ్మ
కలితస్వరూపుఁడై కను బ్రహ్మసుఖము
అపగతాఘులు సందియము లేనివారు
సుపథనిర్జితమానసులు సర్వభూత
హిత నిషక్తులునైన ఋషులు బ్రహ్మమున
ప్రతిపత్తి మోక్షంబు బడయుచుందురు
పాఁడిమ కామక్రోధముల చేత విడువ
బడియు సన్నియమితస్వాంతంబు గలిగి
యతులకిందందు బ్రహ్మానందమొదవు
అతులవిక్రమ పార్థ యాలింపుమరియు
ఎవఁడు సంతతమున్ బహిర్భవంబులగు
శ్రవణాదికముల ద్వారంబుల చేత
సాంద్రబుద్ధిని జొచ్చు శబ్దాదులైన
ఇంద్రియార్థంబుల నెడలించి వెలికి
మీటిభ్రూమధ్యగా మిగ గంటిచూపు
మాట్చిప్రాణాపానమారుతంబులను
నాసికాంతరగముల నడుచు వానిగను
జేసి ప్రవీణత చెలువార మిగుల
నియమింపబడిన యింద్రియ మనోబుద్ధి
రయుఁడయి భయమనోరథ కోపములను

అడగించి మోక్షమందాసక్తుడగుచు
నుడుగక మననంబు నొనరించుచుండు
అతడు నిత్యము ముక్తుడనబడుచుండు
కృతయజ్ఞ తపములకెల్ల నెల్లముగ
దేవతాకృతిచే బ్రతీత భోక్తనగు
ఈవిష్టపములకెవ్వేడ నియామకుడ
ఉర్వి ప్రాణులకెల్ల నుపకారి నగుచు
సర్వసాక్షియునయి శాశ్వతుండనయి
పర్వ్వనన్ను నెఱింగి పారమార్థికుడు
సర్వసంసారోప శాంతినిబొందు
అనుచును పుండరీకాక్షు డత్తరిని
కనికరంబున దెల్పె గాండీవికిట్లు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సస గోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమ హరిసూక్తి తరంగిణియందు
అమరెడు కర్మసన్యాసయోగంబు
అనబడు నిదియు నైదవ తరంగంబు

దనర నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకట శైలపాల.





శ్రీ రస్తు.

## హరిసూక్తి తరంగిణి.

## ఆత్మసంయమ యోగము.

## షష్ఠ తరంగము.

శ్రీ వేంకటగిరీంద్ర చిరదయాసాంద్ర
నావిన్నప మవధానము గల్గి వినుము
భగవంతుడైన శ్రీవాసుదేవుండు
నగుమొగంబున బార్థునకు నిట్టులనియె
కర్మఫలాపేక్ష గనక కర్తవ్య
కర్మకలాపంబు గావించువాడు
ధరకర్మముల పరిత్యాగియున్విమల
తర సుమనస్సమాధానుండునగును
గతమైనయగ్నులు గలవాడుగాడు
గత తపోదానాది కర్ముండుగాడు
కడుఫలవిషయ సంకల్ప మంతయును
ఉడుగని యాతడొండొకడైన కర్మ
యోగి గాడదిగాన నోపాండవేయ
బాగుగ దేనిని బండితుల్కర్మ

కాండపరిత్యాగ కరణలక్షణము
ఉండినదానిగ నొప్పిచెప్పెదరో
అదియె కర్మాచరణాగ్ని లక్షణము
గదయని యెఱుగుమింక దృఢంబుగాను
జ్ఞానయోగము నెక్క గాంక్షించుమునికి
కానగు కర్మంబు సాధనంబగును
జ్ఞానయోగమునెక్కి క్రాలునమ్మునికి
మానుగ సర్వకర్మ నివృత్తి పరమ
సాధనంబగునని సరవి జెప్పబడు
సాధుత నెప్పుడు శబ్దాదులందు
తగిలి యుండడొ కర్మతతులందు సక్తి
నొగడడో యప్పుడు నిఖిలసంకల్ప
పటలివీడిన స్వభావము గల్గువాడు
పటుతరజ్ఞానంబు బడసినవాడు
అని చెప్పబడుచుండు నాసక్తి లేని
మనసుచే సంసారమధ్య నిర్మగ్ను
తనుమద్ధరించుకో దలపగాదగును
తను నధోగతిని బొంద నొనర్పదగదు
తనవశీకృతమైన తన మానసంబె
తనకు జుట్టంబగు దనకులోబడని
మనసే యరాతి యెమనసుచేతనదు

తను కరణాది బృందము గెల్వబడునో
ఆత్మను కరణాదికౌఘ మూమదికి
నత్మనచుట్టమై యనయంబు నమరు
అజిత మనస్కునకైన మానసము
అజితారి వైఖరి నపకారియగును
సుపథనిర్జిత మనస్కుండైన యట్టి
ఉపశాంత పురుషుని కురువుగామనసు
శీతోష్ణ సుఖదుఃఖ సిద్ధులయందు
ఆ తెరంగుననె మానావమానముల
పరగిన యాత్మానుభవమందె యుండు
అరలేని శాస్త్రజన్య జ్ఞానమునను
పరిచితాత్మానుభవ జ్ఞానమునను
పరితృప్తిగనిన భావము గల్గువాడు
పనివడి కదలింపబడకుండువాడు
అనిశ మింద్రియ నిగ్రహము గల్గువాడు
ఒగి పెంటు పైడి రాలొకటైనవాడు
నగు జ్ఞానవంతుడ యాత్మానుభవము
గలవాడనంబడు కౌంతేయవీర
అలఘు సద్గుణునందు నగుణునియందు
ఉపకారియందు నయోగ్యుని యందు
కపటమూనని మైత్రి గలవానియందు

పరులయందు నపక్షపాతులయందు
పరమపాపులయందు బంధువులందు
తనతో విరోధించు దారుణులందు
అనఘులయందు మధ్యస్థునియందు
ధృతిమెయి సమబుద్ధినెవ్వాడు మెలగు
నతడు యోగారూఢుడని చెప్పబడును
పౌరి సదాత్మధ్యానముంగలవాడు
పరసహాయము లేనివాడయి యుండి
నియమిత మానసేంద్రియ శరీరుండు
నయి యాశలేనివా డపరిగ్రహుండు
నయి రహస్యస్థలియందు గూర్చుండి
రయ చలదంతఃకరణము నెప్పుడును
నిగ్రహింపందగు నిపుణత్వమమర
అగ్రీయము పవిత్రమగు ప్రదేశమున
రజమును దుడిచి నిర్మలము గావించి
అజినచేలములుం గుశాళిపై బరచి
కడు క్రిందుగాక మిక్కుట మెత్తుగాక
తడయకాస్తరణంబు తనకు జేసికొని
వ్యగ్రత లేకుండ పరమ నైష్ఠికత
అగ్రిస్థిరాసనమందు గూర్చుండి
మనసు చాంచల్యంబు మలప నేర్పుమెయి

అనిశ చిత్తేంద్రియ వ్యాపారములను
అడచి యోగాభ్యాసి యాత్మనిర్మలత
నడరంగ యోగంబు నభ్యసింపదగు
క్రమముగా నచలంబుగా నుండుటకును
సమముగా దేహ మస్తక కంఠములను
ధరియించి స్థిరుడయి తననాసతుదను
పరికించి దిక్కులవైపు గన్గొనక
శమితమానసుడయి సాధ్వసంబుడిగి
అమలిన బ్రహ్మచర్య వ్రతమందు
బాయకయుండి యొప్పగ గాల్చి మనసు
నాయందుజిత్తంబు నాటించినేన
అతులితోత్కృష్టా శ్రయము గల్గియుండి
అతిసమాహిత చిత్తుడై యుండవలయు
నియమిత మానసుడైన నిర్మలయోగి
యయిన వాడీరీతి ననయంబుమనసు
సుసమాహితము జేయుచును మోక్షపదమై
అసమానముగనున్న యస్మదధీన
సకలసంసారోప శాంతినిబొందు
అకలంకవిక్రమ యమితాశనునకు
ఒక్కింతయు భుజింపకుండు వానికిని
సుక్కిరుక కడునిద్ర జొక్కువానికిని

తినకులేకెప్పుడు మేల్కొన్నవానికిని
ఘనతరంబైన యోగము పట్టువడదు
అనుగుణాహార విహారముల్ గలిగి
పనులందు దగిన వ్యాపారంబు గలిగి
తగిన నిద్దురయు సుస్థానంబుగలిగి
నెగడిన పూరుషునికి దుఃఖహాని
యగుయోగము ఘటిల్లు నహిత వీరఘ్న
పగవానిగెల్చిన పగిదిపోనీక
ఎడపక చిత్తమెవ్వేడ నిగ్రహింప
బడినదై తనయందె వఱలునో యెప్పుడు
అఖిలవాంఛలనుండి యుపగతాశుడయి
సుఖమైన యోగయుంచు వచింపబడును
గాలి వీవనిచోట కలికదీపంబు
ఏలాగున జలింపకెసగునో గోట్లు
మనసునకుసమాధి మహితయోగమును
పనుపఱ్చు నియమిత స్వాంతంబుగల్గు
యోగికి నానిష్ఠ యుపమానమనుచు
యోగశాస్త్రజ్ఞుల యుక్తి రాజిల్లు
బాగురీతిగ నేయవస్థలో మనసు
యోగాచరణముచే నొగి నిగ్రహింప
బడినదై యుపరతి బడయుచుండినదో

నడపి యంతఃకరణంబుచే నెట్టి
దశయందు పరమాత్మదర్శియునగుచు
వశి తనలో మోదపడుచు నున్నాడో
ఏయవస్థను సకలేంద్రియంబులకు
నేమొడ గోచర మింతయుగాక
బుద్ధిచేత గ్రహింపబోలునే సుఖము
సిద్ధమై కలదో నశింపకయున్న
ఆసుఖంబు నెఱింగి యలరుచున్నాడో
వాసవి యానందవాసమై యున్న
ఏయవస్థనుగల యీయోగివరుడు
రోయక తత్త్వస్వరూపంబునుండి
అచలుండ యగునో యేయాత్మలాభమును
ప్రచురంబుగాబొంది పరగ నాయాత్మ
లాభంబుకంటెను లాతిలాభమును
ఆభోగమున నెక్కుడని యెంచబోడో
ఏయాత్మతత్త్వమందె వసించువాడు
పాయని పటుదుఃఖపటలంబుచేత
పొరలింపబడడో యాపూర్వోక్తమైన
గురుదుఃఖములతోడ గూడికలేక
యుండినయునికిని యోగనామమున
నిండియుండిన దానినిగ నెఱుంగనగు

సందేహరహితనిశ్చయముచే దుఃఖ
మొందని మనసుతో నూఱకుండక యెం
ఆయోగమును గూర్పనగు నేర్పుమీఱ
ఏయెడ సంకల్పమేనిదానముగ
నెఱసినకోర్కెల నిశ్శేషముగను
అతిమతినెడలించి ధ్యానంబుచేత
నిఖిలేంద్రియంబుల నియమించి విజయ
సుఖముగా యోగ మద్భగ గూర్పవలయు
ధృతిచే గృహీత బుద్ధిబలంబుచేత
ప్రతివేళ మనసును బరమాత్మయందు
ఉనిచి యల్లల్లన నుపరమింపంగ
నొనరింపగాదగు నుద్యమంబునను
ఎదియేని జింతింప హితవుగాదనఘ
కదలిక శీలంబు గలయదిగాన
స్థిరముగాను మనంబు తివిరి యేతఱిని
అరసి యేయేవిషయములందు దిరుగ
నరుగు నాయావిషయంబులనుండి
సొరవిగా నీమనస్సును మరల్పుచును
తనయందె వశము నొందగ జేయవలయు
చన నశించిన మానసము గల్గువాడు
నష్టమైన రజోగుణము గల్గువాడు

ఇష్టజీవన్ముక్తి నెనసినవాడు
అపగతపాపుడునైన యీయోగి
అపరిమితానంద మదె పొందుచుండు
ఎలమి నీవిధముల నెల్లవేళలను
నలుగు నంతఃకరణం బధీనముగ
జేయుచు నొనరి ప్రక్షీణపాపుడును
ఐయున్న యోగి యనాయాసముననె
పరమాత్మమును లెస్స బరికించి గనుచు
పరమసౌఖ్యంబును బడయుచునుండు
సకలభూతములందు సమదర్శనుండు
ప్రకటయోగయుతాంతరంగంబు గలిగి
అన్నిభూతములందు వ్యాపించియున్న
తన్నును దనయందు దనరుచునున్న
ఎల్లభూతంబుల నీక్షించుచుండు
ఎల్లభూతములందు నెవ్వాడు నన్ను
దర్శించునో సమస్తంబు నాయందు
దర్శించునో యట్టి ధన్యునికేను
సతతంబు మరిపరోక్షము నొందకుండు
అతడు నాకు పరోక్షమందక యుండు
వెలయునేయోగి యభేదంబునొంది
పొలుచుచున్న సమస్తభూతంబులందు

ఒలయు నన్ను భజించుచుండునో వాడు
పలువిధంబుల చేత వర్తించుచున్న
వర్తించుచుండును వాడు నాయందె
పూర్తిగ వినుమిది పురుహూతపుత్ర
సునయయోగి యెవండు సుఖదుఃఖములను
తనతోడ సరిగ భూతముల నన్నింట
గనుచుండునో యట్టి జ్ఞానిశ్రేష్ఠుండు
అనుమతుండును నాకు నగునుర్వియందు
అనుడు కిరీటి మురారి కిట్లనియె
తనర మనస్సమాధానంబు చేత
ఇప్పుడు నీచేత నీయోగమమర
నొప్పుగ ప్రోక్తమై యుండెనో నేను
ఎపుడు చంచలమౌట నీయోగమునకు
చపలత లేని శాశ్వతమైన స్థితిని
కానను గావున కమలనేత్రుండ
మానసంబతుల కంపన శీలయుతము
బాధించునది పట్టువడకుండునదియు
శోధింప నామనస్సురీతి నిరోధమును
అనిలనిగ్రహము చాయను సుదుష్కరమె
అని నేదలంచెద నసురసంహార
కావుడు వసుదేవ నందనుండనియె

భావింపగ మనంబు బహుచంచలంబు
పట్టనశక్యమై పరగుచుండునది
అట్టిదియైన సమాహితత్వమున
ప్రతిలేకయున్న వైరాగ్యంబుచేత
హితకరంబుగ నిగ్రహింపగాబడును
నియమింపబడక యుండిన మానసంబు
రయిసమేతునిచేత రమ్యయోగంబు
పొందనశక్యంబు భూరియత్నంబు
నందంబుగనొనర్చు స్వాధీనమనసు
గలవానిచేతను ఘనతరోపాయ
బలముచే పొందంగ వచ్చునటంచు
నామతంబిదియని నరకారిబలుక
భీమానుజుడు కృష్ణు వీక్షించి యనియె
తెలుపు మచ్యుతుడ యాస్తికబుద్ధిగరిమ
గలవాడు నియమసంగతి లేనివాడు
యోగంబువలన విచ్యుత మనస్కుడయి
యోగసిద్ధఫలంబు నొందకవాడు
ఏగతినొందంగ నేగుచున్నాడు
బాగుగ పరమాత్మ పద్ధతిం దెలియ
జాలనిమూఢుడాశ్రయ హీనుడగుచు
మాలకర్మజ్ఞానముల రెంటనుండి

గళితుడై ఛిన్నమేఘంబు కైవడిని
పొలిసి పోవుండునే పురుషవరేణ్య
నీవు నాకిట్టి సందియమెల్లదీర
భావించియిప్పుడు పలుకనోపుదువు
ఈసంశయము దీర్పనింకనీకంటె
వాసిమీరిన వాడు పరుడు లేదుగద
అనుడు పార్థునిజూచి హరియిట్లులనియె
అనఘ ధనంజయ యాలింపుమీవు
అట్టి యోగభ్రష్టుడైన మర్త్యునకు
ఎట్టిదైన వినాశ మీలోకమందు
నిట్టలంబుగ లేదు నిజమింతెగాక
అట్టులు పరలోకమందును లేదు
ఓయన్న శుభకృత్య మొనరించువాడు
నేయెడ నొకడైన నెట్టిదుర్గతిని
గానడుగాదె యొకండునుగాని
జ్ఞానయోగమునుండి జారినవాడు
పుణ్యవంతుల లోకముల పొంది సుజన
గణ్యుడై యందనేక సమంబులుండి
సొంపుంతులును సదాచారవంతులును
శ్రీమంతులగువారి గృహమందు బుట్టు
అదిగాని చో నిశ్చయాత్మకబుద్ధి

కుదిరిన యోగుల కులమందు బుట్టు
ఏహేతువున నిట్టి యేయీభవంబు
ఊహింప దుష్ప్రాప్యమో లోకమందు
ఆయోగకులమందు నపుడు తొల్లింటి
కాయమందానరిన ఘనబుద్ధితోడ
కలయిక లభియింపగలదనంతరము
చెలగి పూర్వజ్ఞాన సిద్ధికైమరల
తడయక గను బ్రయత్నంబాచరించు
అడరిన పూర్వ జన్మాభ్యాసముననె
అనధీన మానసుండైనను వాడె
అనువుగా వడివిషయంబులనుండి
తొలగింపబడియుండు దురమిత్రదమన
కొలకువతోడను మెలగుచునుండి
వలసి యోగస్వరూపంబు నెఱుంగ
దలచినవాడు వేదప్రతిపాద్య
కర్మాచరణ ఫలకామిగాకుండు
నిర్మలినజ్ఞాన నిష్ఠుండు మిగుల
యతమానుడగుచుం బ్రయత్నంబువలన
కృతపాప పరిశుద్ధి కీలితుండగుచు
బహుజన్మ సంస్కృతివలన శుద్ధుడయి
మహనీయగతిని బిమ్మట బొందగలడు

ధారుణి కృచ్ఛ్రాది తపములుంగల్గు
వారలకంటెను ప్రవరుండు యోగి
నిగమశాస్త్రార్థ పాండిత్యంబుచేత
తగువారికంటె నుత్తముఁడైనవాడు
బహుకర్మఠులకంటె పరముండు గాన
గ్రహణార్థయోగంబు గలవాడవగుము
అనుచు యదూద్వహుం డర్జునుండలర
దనరెడు వాక్యామృతము వెల్లిగొలిపె
అనిధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర
కనదింద్రకంటి వేంకటశాస్త్రి కృతము
రమహరిసూక్తి తరంగిణియందు
అమృతదం బాత్మసంయమన యోగంబు
అనబడు నిదియ యాఱవతరంగంబు
దనరసీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకట శైలపాల.





శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

విజ్ఞాన యోగము.

సప్తమ తరంగము.

శ్రీమహర్షి శ్రవన పోషిత సర్వభువన
కామాబ్దపవన వేంకటశైలభవన
అవధరింపుము మదీయంబైన మనవి
ప్రవచించె వనమాలి పార్థునకిట్లు.
వేగనాయందు బ్రవిష్టచిత్తమున
యోగంబుజేయుచు నున్నవాడవును
నేనెయాశ్రయముగా నెగడువాడవయి
మానితాఖిలగుణ మండితుండనగ
అలరు నన్నెటుసందియము లేకయుండగ
గలవా యాజ్ఞాన మాకర్ణింపుపార్థ
ఈముక్తికయిచేని నెఱిగినన్మఱల
నేమియు మిగులదో నెఱుగబోలునది
నానిజానుభవ జన్యజ్ఞానసహిత

మైనయాశ్రవణ జన్య జ్ఞానమెల్ల
పొలుపుగ నాలింపు పూర్ణంబుగాగ
తెలియజేసెదనీవు దనుజేంద్రతనయ
ఘనతరశాస్త్రాధికార యోగ్యులగు
మనుజులవేలలో మహానొకానొకడు
అరమాత్మసిద్ధికై యత్నించుచుండు
వసునయత్నించెడి వారలలోను
వైశేషసిద్ధులౌ వారలలోను
వెలయనొకండొకండు వెలయంగనన్ను
దవిరవాస్తవముగ దెలియుచున్నాడు
అవని తన్మాత్రంబయగు గంధగుణము
అనలము తన్మాత్రమగు రూపగుణము
అనిలము తన్మాత్రమగు స్పర్శగుణము
అంబువు తన్మాత్రమగు రసగుణము
అంబర తన్మాత్రమగు శబ్దగుణము
అలఘు మనోబుద్ధ్యహంకారములని
పొలుచు నెన్మిదిభేదముల నాదుప్రకృతి
హనుమద్ధ్వజ నికృష్టమైన దీప్రకృతి
అనఘమీప్రకృతికన్యంబయిపాణి
ధారణహేతు భూతంబైనదాని
నారయు ముత్కృష్టమగు నాప్రకృతిగ

పరనీజగము దాల్పబడుచుండె దాని
వెస వివరంబుగా వేసరకీవు
సాంజ్ఞ తెలియుము సర్వభూతములకు
కీరెండుప్రకృతులే హేతువులందు
ఆప్రకృతిద్వయ ద్వారముచేత
ఈప్రపంచంబునకే నేయుత్పత్తి
కారణంబును నాశకారణంబగుదు
భారత వంశసంభవ వీరవర్య
నాకంటె కడువరేణ్యంబైన దితర
మేకారణముకొంచె మేనియు లేదు
నాయందు నీయఖండప్రపంచంబు
పాయక దారాన మణిరత్నతతులు
వలెనుగూర్పంబడె పాండుకుమార
జలములందు రసంబు శశిసూర్యులందు
ప్రభయు వేదములందు ప్రణవాక్షరంబు
నభమందు శబ్దంబు నరజాతియందు
పురుషభావంబేను పురుషాగ్రగణ్య
ధరయందు సురభిగంధము నగ్నియందు
రాణించు తేజంబు ప్రాణులందెల్ల
ప్రాణధారకమైన బ్రదుకును నేను
తాపసులందును తపమును నేనె

ఓ పృథాపుత్ర నిత్యుడనైననన్ను
శంక లేకెఱుగుము సకలప్రాణులకు
నంకుర కారణంబైన వానిగను
ఇంతియోగాక నేనె వివేకశక్తి
మంతుల నిశ్చయాత్మకమైన బుద్ధి
ఆగక తేజస్వులగు వారియొక్క-
ప్రాగల్భ్యమును నేనె పాండుపుత్రుండ
కలుషిత కామరాగంబులు లేని
బలముగల్గినవారి బలమును నేనె
స్వనితంబినులయం దపత్యార్థమగుచు
అనువగు ధర్మశాస్త్ర విరుద్ధతను
గని ప్రాణులందున్న కామంబు నేను
అనఘుండ గుణములం దగ్రియంబయిన
అమల సత్త్వగుణంబునందుద్భవించు
శమదమాదికములై చను పదార్థములు
అల రజోభవ దర్ప హర్షాదికములు
పొలుచు తామసశోక మోహాదికములు
ఏవియున్నవో యవియెల్లను పార్థ
నావలనన పుట్టినవని నీవెఱుగు
ఆభావముల దేనియం దేని లేను
ఆభావములు గలవన్ని నాయందు

తరముగ మూఁడు విధంబులైనవియు
గుణత్రయ సత్త్వాది గుణవికారములు
నను నీశ మాఁది పదార్థసంతతుల
నవివేకముంద జేయఁబడినట్టి
ఈవిశ్వమంతయు నీభావములకు
పైవిలక్షణుఁడ నవ్యయుఁడనౌ నన్ను
తెలియనేరదో కింత దేవేంద్రతనయ
సలలిత మహిమానాసక్తుండనయిన
నాదుసంబంధము త్రైగుణ్యమయము
నాదివ్యమీయస్మదాయత్తమాయ
ఎందుచేతను దరియింపగారాదో
అందుచేతను నన్ను నవనిలో నెవరు
శరణుజొత్తురో వారు సరగనీమాయ
తరియించుచున్నారు తప్పక విజయ
వృజినముల్ చేసి వివేకంబులేని
ప్రజలలో నధములు పటుమాయచేత
అపహృతజ్ఞాన పదార్థంబు కలిమి
ఎపుడు నాసురమైన హింసానృతాది
భరితభావమున నన్భజియింప రవని
దురమిత్ర దుర్మార్గ దురితబాధితుడు
అలఘు శార్దూల చోరాది పీడితుడు

నిల నన్నెరుఁగ నిచ్చయించినవాఁడు
ధనకాము డాత్మతత్త్వ మెరింగినతఁడు
అనెడు నీనలు తెగలై యున్న ధన్య
జనులు నన్ను భజింతురు సతత మర్జునుడ
అనుఘ గా నీనల్వురిం గువారియందు
అనఘ యోగముచే ముఖ్యంబైన భక్తి
గనిన సుజ్ఞానంబు గలవాఁడు ఘనుఁడు
నేను మిక్కిలియు జ్ఞానికి నెప్డుఁ బ్రియుఁడ
జ్ఞానియు నాకు నిష్టంబైనవాఁడు
ఈనల్వురును మహోత్కృష్టులే యందు
జ్ఞాని నేనే యని సతము నామతము
ఆజ్ఞాని నియమిత స్వాంతంబు గల్గి
ప్రజ్ఞ చేతను నన్నె ప్రబలమైనట్టి
గమ్యపదంబని గనుచుండు గాన
సౌమ్యసద్గుణగణోజ్జ్వల యాలకింపు
పలుజన్మముల కడపటను జ్ఞానంబు
గలిగినవాఁడయి గ్రాహ్యమై కాన
బడునది యంతయు వాసుదేవుఁడని
పుడమి నెవ్వఁడు నన్ను బొందుచున్నాఁడో
అట్టి మహాత్ముఁ డత్యంత దుర్లభుఁడు
పట్టుగ స్వీయ స్వభావంబు చేత

కామితుల్ నత్త్ర ద్విషయ రాజిచేత
గాసిజెందిన వివేకము గల్గినారు
వ్యయాతి నాయాదేవ తారాధనాది
నియమ మధిష్ఠించి నిత్యభక్తులయి
ఇతర దేవతల నహా భజించుచుండు)
ధృతినెవ్వడేయే యభీష్టంబుగల్గి
చనుపున భక్తుడై శ్రద్ధాళువగుచు
దనరి యేయే దేవతావిగ్రహమును
స్థిరత బూజింప వాంఛించుచున్నాడో
కరము నాయాకోర్కె గలవానికేను
అట్టి శ్రద్ధనె తిరంబైన దానిగను
నట్టక సేయుచున్నాను పార్థుండ
వాడు నాచే జెప్పబడు శ్రద్ధతోడ
వీడకా దేవతావిగ్రహార్చనము
ఆచరించుచునుండు నత్యంతముగను
నాచేత నీబడిన యభీష్టములను
ఆవిగ్రహమునుండి యందుచున్నాడు
వావిరి యన్యదేవతల బూజించు
వారలాయన్యదేవతల నొందెదరు
ఆయాధమైయున్న యల్పబుద్ధిగల
యాయన్యదేవతాభ్యర్చకులొందు

నాయాఘలంబంతమై యుందునదియె
నాభక్తులగువారు నన్నెపొందెదరు
శోభాకరము నాశశూన్యంబు పరము
నిరతిశయంబుగ నెగడు నారూప
మరయజాలని మూఢు లప్రకాశకుని
నను ప్రకాశమునొందిన మనుష్యునిగను
అనిశము భావింతు రర్జునా వినుము
ఎల్లలోకమున కేదృశ్యుండగాను
ఉల్లసిత జ్ఞాన మొనర కీజనుడు
ఘనయోగమాయచే గప్పంగబడుచు
నను జన్మరహితుగా నాశహీనునిగ
కడకనెఱుంగడు గాండీవధన్వ
కడచినవున్నవి కాగలయవియు
నైన భూతముల నేన యెఱింగియుందు
ఏనాడునొకడైన నెఱుగడునన్ను
జననకాలమున నిచ్ఛాద్వేషములను
జనియించి సుఖదుఃఖచయహేతువైన
అవివేకబలమున నఖిలభూతములు
అవిరత మజ్ఞాన మందుచున్నయవి
రాజిత సుకృతకర్మము గల్గియున్న
యేజనంబుల పాపబృందనాశనము

పొందునో యాజనంబుల సుఖదుఃఖ
సందోహహేతువై చను నవివేక
బలముచే విడువంగబడినవారలయి
వలనుగ నియమసంపన్నులై నన్ను
భజియించుచున్నారు పాండుతనూజ
స్వజరామరణయుక్తి వదలుటకొరకు
ఎవరు నన్నే యాశ్రయించి యత్నంబు
అవని జేయుదురో వారా బ్రహ్మవిధము
ప్రత్యగాత్మవిషయవస్తువు నెల్ల
నిత్యకర్మములెల్ల నేర్తురెఱుంగ
అధిభూత మధిదైవ మధియజ్ఞమనెడి
విధముల మూటితో వెలయునన్నెవరు
ఎఱుగుదురో వారు మృతికాలమందు
మఱువక నియమితమానసులగుచు
నను నెఱింగెదరు నిర్ణయమ్ముగా విజయ
అనుచు క్రీడికి దెల్పె యదుపుంగవుండు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధర నిది త్రిపురసుందరి కటాక్షమున
నరయు శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర

కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
వను హరిసూక్తి తరంగిణియందు
స్వమనఃప్రియంబు విజ్ఞానయోగంబు
అనబడు నిదియ యేడవతరంగంబు
దనర నీకిది యర్పితంబౌను గాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల





శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

అక్షర పరబ్రహ్మ యోగము.

అష్టమ తరంగము.

శ్రీ వేంకటాద్రీశ దృఢచిత్ప్రకాశ
నావిన్నపము ప్రసన్నతనొంది వినుము
పనివడిక్రీడి యాబ్రహ్మాదికముల
విసగోరి రుక్మిణీ విభునకిట్లనియె
యాదవవల్లభా యాబ్రహ్మమేది
ఏదయ్యా యధ్యాత్మ మేదికర్మంబు
అధి భూత మెట్టిదియని చెప్పబడును
అధి దైవ మెట్టిదియని పలుకబడును
అరిభీమ యీదేహమం దధిష్ఠాత
వర ప్రయోజకుడును ఫలదాయకుడును
ఎవడీవిషయమందు నెటుల జ్ఞేయుండ
వవుదువు ప్రాణప్రయాణకాలమున
ప్రజితచిత్తము గల్గువారలచేత
ద్విజపూజ్య నీవెట్లు తెలిసికోబడుదు

అనిన బార్థునకిట్లు హరిపల్కె నో డగా
అనఘుండ నిరతిశయ బ్రహ్మమెపుడు
భయశూన్య మాపరబ్రహ్మంబు యొక్క
వ్యయమునొందని ప్రత్యగాత్మభావంబు
అనిశంబు నధ్యాత్మమని చెప్పబడును
అనగ మేనున బ్రత్యగాత్మరూపమున
అధివసించునది యధ్యాత్మమర్జునుడ
అధికమానదియు బ్రహ్మస్వరూపంబ
నులుసులేకెల్ల ప్రాణుల స్వరూపమును
కలిగించునట్టియు క్రతుభుజులకుగ
కృత పురోడాశాది హితపదార్థముల
తలిపరిత్యాగ ముక్తము కర్మమనుచు
ప్రాణిజాతమనంగ వ్యయమొందుజన్మ
మైనవస్తువన నూర్వ్యాంతర్గతుండు
ప్రాణుల సకలేంద్రియ గాహకుడును
విన హిరణ్య గర్భాభిధానుండు
తనుధారులందు మొదటివాడు పురుషు
డని చెప్పబడువాడు నఖిల భూతముల
ఆదికర్తయగు బ్రహ్మజనించెస్సృష్టి
కాదియందనుచు శ్రుత్యర్థంబు గలదు
అధికముగా దేవతాధిపుడాట

అధిదైవతంబని యింద్రుడు దేహమున
మహాసర్వాంగాభిమాని విష్ణుడను
మహితదేవత నేనె మానవశ్రేష్ఠ
కనుగొన యజ్ఞంబు కాయంబు చేత
నాచరింపబడుటచే నాడవియందుండె
నని మొదలాధారమై యుండెననియా
విని దీనిభావంబు విడయనివెలుగు
మరణవేళనునన్నె స్మరియించునెవడు
ధరయందు దేహముం ద్యజియించిచనునో
వాడునారూపంబు బడయుచున్నాడు
క్రీడి లేదిక దీనికిన్ సందియంబు
తనకు గాలమువచ్చు తఱిని డెందమున
తనర నేయేదేవతా విశేషమును
తలచుచు దనమేను ద్యజియించువాడు
తలరకాయాదేవతా విశేషమునె
భావించి తద్భావ భావితుండగుచు
నావేళ తద్భావ మందుచున్నాడు
ఏకారణంబున మృతికాలమందు
నాకంటె నితర చింతనము జేయుటను
క్షమ బునర్జన్మాది కారణంబగునో
అమరేంద్రతనయాండ యాకారణమున

సకల కాలములందు స్మరియింప నన్ను
ప్రకట శాస్త్రప్రకారము పేర్కొనన్ను
నీమనోబుద్ధులు నిలుపు నాయందె
క్షేమంబుగా నన్నుఁ జేరెదవు
ఓ యర్జునుఁడ వినుము కీర్తింతు దాని
ఈయర్థమందు లేదే సంశయంబు
ఒనరిన యభ్యాస యోగంబుతోడ
నెనసి యున్నట్టిది యితరంబు వస్తువును
గానని దైన నిష్కలుష చిత్తమున
భానుమండలమందు బ్రభవించినట్టి
పరమపూరుషశాస్త్ర పద్ధతివలన
వరగురూపదేశ వాక్యంబువలన
పరగ తలంచుచుఁ బరమపూరుషుని
పొరయుచు నుండును బుధుఁడు కౌంతేయ
పరముఁడు నఖిల ప్రపంచశిక్షకుఁడు
అరసి తలంప శక్యముగానిరూప
భరితుఁడు నాదిత్యవర్ణంబువంటి
స్థిరమైన చైతన్య తేజంబువాఁడు
ప్రణతికర్హుండు సర్వమెఱుంగువాఁడు
అణువుకంటెను కరంబణువైనవాఁడు
ఘనతరాజ్ఞాన లక్షణమైన మోహ

మను తిమిరముకంటె నవ్వలివాఁడు
పౌరి పురాతనుఁడైన పురుషు నెవ్వాఁడు
స్మరియించునో వాఁడు సరగ నాపురుషు
పొందుచున్నాఁడు పూరువంశజుఁడ
కందక దేహాంత కాలంబునందు
చలనమొందని మానసంబుతో భక్తి
బలముతోను సమాధి బలజసంస్కార
జనిత చిత్తస్థైర్య సంజ్ఞితంబైన
తనయోగబలముతో దనువువాడఁగుచు
కనుబొమ్మలకుమధ్యగతముగాఁ బ్రాణ
మనువాయువును జక్కనమరించి యెవఁడు
నుది నాపరమపూరుషుని డెందమునను
నుచితంబుగ దలంచుచుండునో వాఁడు
తేజోమయుండు నుత్కృష్టరూపుఁడును
రాజిల్లు పురుషుఁ జేరఁగలండు పార్థ
వేదార్థమెఱిఁగిన విద్వదగ్రణులు
నాదట నేతావు నక్షరంబనుచు
ప్రవచింతురో వీతరాగులైనట్టి
స్వవశీకృతేంద్రియుల్ సన్యాసులెప్పుడు
చెడనియే పదమును జెందుచున్నారో

ఎడయు కేయక్షరస్థానమాసించి
వడినెలయింగుటగోరి బ్రహ్మచర్యమును
ఉమగక చేయుచునున్నారో యట్టి
నక్షరాఖ్యంబైన ప్రాప్యపదంబు
వీక్షించి నీకు జెప్పెద సంగ్రహముగ
తొమ్మిది ద్వారముల్ తొలుత లెస్సగను
కప్పి హృత్కమలభాగమునందు మనసు
అరికట్టియపుడు వశ్యంబైన మనసు
సరణిచే హృదయకంజముకంటె నూర్ధ్వ
గామియౌ నాడిచే కడగి యూర్ధ్వముగ
నేమరకెక్కించి యిరవుగా శిరము
చెరువ భ్రూమధ్యసీమంబునందు
వారక తనప్రాణవాయువు నిల్పి
యోగధారణచేసి యుత్కృష్టమైన
బాగుగ చిద్బ్రహ్మ వాచకంబయిన
ఓమను ముఖ్యమౌ నొక్కవర్ణమును
వేమారువల్కుచు వలయునోంకార
వాచ్యుండనగు నన్ను వడి దలంచుచును
నైచ్యమొందిన మేను నవయకుండగను
పరిహరించుచునున్నవాడై యెవండు
అరుగుచున్నాడో యాతడుత్కృష్ట

మును తిమిరముకంటె నవ్వలివాఁడు
శౌరి పురాతనుఁడైన పురుషు నెవ్వాఁడు
స్మరియించునో వాఁడు సరగ నాపురుషు
పొందుచున్నాఁడు పూరువంశజుఁడ
కందక దేహాంత కాలంబునందు
చలనముందని మానసంబుతో భక్తి
బలముతోను సమాధి బలజసంస్కా
జనిత చిత్తస్థైర్య సంజ్ఞితంబైన
తన యోగబలముతో దనరువాఁడగుచు
కనుబొమ్మలకుమధ్యగతముగా బ్రాణ
మనువాయువును జక్కనమరించి యెవఁడు
శుచి నాపరమపూరుషుని డెందముందు
సుచితంబుగ దలంచుచుండునో వాఁడు
తేజోమయుండు నుత్కృష్టరూపుఁడయి
రాజిల్లు పురుషుఁ జేరగలండు పార్థ
వేదార్థమెఱిగిన విద్వదగ్రణులు
నాదట నేతావు నక్షరంబనుచు
ప్రవచింతురో వీతరాగులైనట్టి
స్వవశీకృతేంద్రియుల్ సన్యాసులెప్పుడు
చెడని యే పదమునఁ జెందుచున్నారో

ఏడయు కేయక్షరస్థానమాసించి
వడి నెఱుంగుటగోరి బ్రహ్మచర్యమును
ఉమగక చేయుచున్నారో యట్టి
యక్షరాఖ్యంబైన ప్రాప్యపదంబు
వీక్షించి నీవు జెప్పెద సంగ్రహముగ
తొమ్మిది ద్వారముల్ తొలుత లెస్సగను
కమ్మి హృత్కమలభాగమునందు మనసు
అరికట్టియపుడు వశ్యంబైన మనసు
సరణి చే హృదయకంజముకంటె నూర్ధ్వ
గామియౌ నాడిచే కడగి యూర్ధ్వముగ
నేమర కెక్కించి యిరవుగా శిరము
చేరువ భ్రూమధ్యసీమంబునందు
వారక తనప్రాణవాయువు నిల్పి
యోగధారణచేసి యుత్కృష్టమైన
బాగుగ చిద్బ్రహ్మ వాచకంబయిన
ఓమను ముఖ్యమౌ నాక్షరవర్ణమును
పేమారు పల్కుచు వలయునోంకార
వాచ్యుండనగు నన్ను వడి దలంచుచును
నైచ్యమొందిన మేను నవలోకుండగను
పరిహరించుచునున్నవాడై యెవండు
అరుగుచున్నాడో యాతడుత్కృష్ట

౧౨౨-౧ అక్షరపరబ్రహ్మయోగము.

పరమైన ప్రాప్యపదమునొందగలుపు
పరమార్గమిది నీకు బల్కెదస్విజయ
ఎవడన్యవిషయవిహీనచిత్తుడయి
తవిలినన్ బరమేశు దాను జీవించి
యున్నంతవరకును నోలి బ్రత్యహము
ఎన్నిక విడి స్మరియించుచున్నాడో
స్వీయసమాహిత చిత్తుడై యున్న
ఆయోగికరయ నేనతిసులభుండ
కరమనుత్తమబుద్ధి గలవారు నన్ను
ఇరవుగ బొంది యుత్కృష్టమైనట్టి
మోక్షసంసిద్ధిని బొలుపొందగాంచి
అక్షయాధ్యాత్మికాద్యఖిలదుఃఖముల
ఆలయంబు ననిత్యమగు పునర్జన్మ
మేలాగు నేన్ బొందరిలయందు విజయ
సఖుడ యాబ్రహ్మవిష్టపముతో గూడ
నిఖిలలోకములు వెండియును రాగలవి
నను బొందిరేని గానరు పునర్భవము
విను మేను వివరింతు వెండియు విజయ
ఇల నహోరాత్రము లేజనుల్ దెలియ
గలవారో యాజనుల్ గమలగర్భునకు
యుగసహస్రముదాక నుండు నేపగలు

యుగసహస్రము దాకనుండు నే రాత్రి
దానిని దానిని దాటియుంగుదురు
ఆసలువరు బవ లరుదెంచునప్పుడు
అజునియందు జరాచరాత్మకంబైన
ప్రజలందఱుదయింతు) పాండుతనూజ
అజునకెప్పుడు రాత్రి యరుదెంచునపుడు
ప్రజలా చతుర్ముఖునం దడంగుదురు
మును కల్పమందు నే భూతజాలంబు
జనియించె నా భూతజాలంబె యిద్ది
అవశమై యిది పవలరుదెంచుతఱిని
భువి పుట్టుచుండు ఫాల్గుణ రాత్రియైన
అజునియందే లీనమగుచున్నయది
ప్రజ యిట్లు ప్రభవించి ప్రభవించియణగు
అగుట నా పూర్వోక్తమగు భూతతతికి
తగు కారణంబౌ విధాతృనికంటె
పరమంబు వ్యతిరిక్త మత్యగోచరము
స్థిరతరంబైనదై దీప్తిమంతమయి
పరగు నేయక్షరబ్రహ్మంబు గలదా
పరికింప నప్పరబ్రహ్మంబ శేష
భూతముల్ నశియించి పోవుచుండినను
ఏతెఱంగున నశియింపకే యుండు

అవినాశియని యింద్రియాగోచరమని
ప్రవరమౌ నేపరబ్రహ్మముక్తమగు
దాని నుత్కృష్టగంతవ్యధామంబు
గా నుడువుచునుందురో కపికేతనుండ
ఏభావమును బొంది యిల బుట్టరారో
ఆభావమస్మదీయః హర్మ్య పదము
ఏపూరుషునిలోన నెసగునో ప్రాణు
లేపూరుషునిచేత నీసర్వజగము
వ్యాపింపబడియెనో యాపూరుషుండు
చాపల్యవిరహితజ్ఞానలభ్యుండు.
ఏవేళయందు బోయిన కర్మయోగు
లావృత్తిగని జన్మమందుచున్నారో
ఏవేళయందు బోయిన కర్మయోగు
లావృత్తిగన కుదయంబందరారో
ఆవేళ నాకృతి నాలింపు విజయ
నే వివరంబుగా నీకు చెప్పెదను
జ్వలనాభిమాని దేవతయు నవ్వలను
మలయు జ్యోతికి నభిమానిదేవతయు
మఱల మీద దినాభిమానిదేవతయు
మఱి శుక్లపక్షాభి మానిదేవతయు
వహింపతో నొప్పు షణ్మాస రూపమగు

షహాదుదగయనాభి మానిదేవతయు
సరణిన్నైయున్నదా సరణిని జన్న
పరమాత్మవేత్తలై పరమసమాధి
భరితాంతరంగులై పరగుమానవులు
వరుసగా బ్రహ్మంబు పడయుచున్నారు
షలసెడి ధూమాభిమాని దేవతయు
షలినయారాత్ర్యభిమాని దేవతయు
షరి కృష్ణపక్షాభిమాని దేవతయు
సరవిగ నాఱుమాసముల రూపమయి
అభిమతంబగు దక్షిణాయనంబునకు
నభిమానిదేవత యఃయనమైయుండె
ఆమార్గమున నేగనగు కర్మయోగి
సోమసంబంధమై సొంపొందుచుండు
శ్లధమగునట్టి యిష్టాపూర్త ఫలము
అధిగమించియు బునరావర్తి నొందు.
పూని జ్ఞానాజ్ఞానముల ప్రకాశకము
లైనట్టివియు ననిత్యంబులైనవియు
జగిమునకంతకు సమ్మతంబులును
అగునవి యీరెండె అయనముల్ పార్థ
చూడుమీగతులలో శుక్లపక్షగతి
జాడనేగినరాడు జగతికి నల

ఇరవుగ నితరమౌ కృష్ణపక్షగతి
నరిగిన దిరిగి వాడరుదెంచు పార్థ
క్రిన్నన నీప్రోక్తగతుల నెఱింగి
యున్న యొకానొక యోగిమోహంబు
నెనయడుగావున నెల్లకాలముల
ఒనరనీవిక యోగయుక్తుండవగుము
తపముల క్రతువుల దానంబులందు
విపుల వేదములందు విజయమేపుణ్య
ఫలముపదేశింపబడెనో యాసర్వ
ఫలము నతిక్రమింపగలండు యోగి
ఇంతియుగాదెల్ల యీయర్థమెఱిగి
అంతట నుత్కృష్ట మాదికారణము
అనుపమంబైన బ్రహ్మము నొందుచుండు
అనుచు క్రీడికిదెల్పె యదుపుంగవుండు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు

భ్రమహ్వా దక్షర పరబ్రహ్మ యోగంబు
అనబడునిది యెన్మిదవ తరంగంబు
దనరనీకిది యర్పితంబౌనుగాత
సహంతాహింతాసీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీరస్తు.

హరిసూక్తి తరంగిణి.

రాజవిద్యారాజగుహ్యయోగము.

నవమ తరంగము.

శ్రీవేంకటనగాధ్యక్షాతభక్తమాధ్య
శ్రీవల్లభుండు కిరీటికిట్లనియె
ఓగుణాకరమదీయోక్తి నాలింపు
బాగుగ సంసార బంధంబువలన
ఏగతి నేజ్ఞానమెఱిగి ముక్తుడవు
కాగలవోయట్టి కడురహస్యంబు
అగణితానుభవజన్య జ్ఞానసహిత
మగు నీద్భుతజ్ఞాన మనసూయుడవగు
నీకు నేజెప్పెద నిర్ణయంబుగను
ఊకొని యాలింపుమో సవ్యసాచి
ఈపరబ్రహ్మంబతీదితజ్ఞాన
మేపట్టున మహాతత్త్వమైనదియు
అతిపావనంబు విద్యలగుందుశ్రేష్ఠ

మతిరహస్యములందు నతివరిష్ఠంబు
సులలిత ప్రత్యక్ష సుఖబోధకంబు
తొలగని ధర్మంబుతోడ గూడినది
పనిసేయసుకరంబు వ్యయము లేనిదయు
అనుపమానంబైన యానంద మొసగు
ఈదృశాత్మజ్ఞాన హృద్యధర్మమును
ఆదృతినమ్మక నాస్తికులయిన
పురుషాధములు నన్ను బొందకమృత్యు
కరణసంసార మార్గమునందె యుంద్రు
సకలేంద్రియాళి గోచరముగానట్టి
ప్రకటరూపంబున బరగునాచేత
ఈదృశ్య విశ్వమెల్లెడ వ్యాప్తమయ్యె
పాదుగ సర్వజీవములు నాయంద
ఉన్నవి వానియందుండను నేను
పన్నుగ నాయందు బ్రహ్మాయాదియును
స్థావరంబంతమై తనరు భూతములు
లేవ దేమనిన నాలింపుమర్జునుడ
జానుగ నీశ్వర సంబంధమైన
నానిపుణత్వమెంతయు గనుంగొనుము
పరికింప నాస్వరూపమ్ము ప్రాణులను
భరియించునదియును ప్రాణులవృద్ధి

బొందించునదియైన భూతంబులందు
పొందియున్నదికాదు పురుహూతపుత్ర
అంటక నిండియున్నదియు గొప్పదియు
నంతంబు లేనిదియగు వాయువెట్లు
ఉప్పరంబుననుండునో యట్లుప్రాణు
లొప్పగనాయందు నుండు నంచెఱుగు
ప్రళయవేళను నెల్ల ప్రాణిజాలములు
పొలుచునామాయను బొందుచున్నయవి
సృజన కాలమునందు నెల్లప్రాణులును
విజయుండ సృజియింతు వెండివెండియును
అకలుష స్వీయమాయను స్వీకరించి
ప్రకృతివశంబున స్వాతంత్ర్యమెడలి
చనిమెలంగెడు భూత జాలంబు నెల్ల
ఎనయంగ మఱిమఱి సృజియించుచుండు
ఆకర్మములు నెట్టి యవసరంబునను
ఆకర్మములయందు నభిమానముడిగి
నిరపేక్షకుని రీతి నివసించునన్ను
అరసి బంధింపవు హనుమద్ధ్వజుండ
అకలంకమగు సాక్షియైన నాచేత
ప్రకృతియే సచరాచర ప్రపంచంబు
పుట్టించుచున్నదెప్పుడు సవ్యసాచి

ఇట్టి సాక్షిత్వమన హేతువుచేత
ప్రచురంబుగ జగంబు వర్తించుచుండె
అచలత ప్రాణి నియామకంబగుచు
నలువుగ పరమైన నాదుతత్త్వమును
తెలియని మూఢులు తత్స్రష్టునినన్ను
అధమ మానవ దేహమ్మవలంబితునిగ
వృధనవమానింతు రిల ఫల్గునుండ
వ్యర్థాశగలవారు వ్యర్థకర్ములును
వ్యర్థకుజ్ఞానసమాశ్రితులైన
అవివేకజనులు హింసాత్మకంబగుచు
అవిరత కామదర్పాది యుక్తమగు
బహుమోహన స్వభావము నాశ్రయించి
మహనీయు నన్నవమానించుచుంద్రు
ఈము మహాత్ములు దైవసంబంధమైన
అమల స్వభావంబు నాశ్రితులగుచు
భూతకారణు నాశమును లేనినన్ను
ప్రీతితోడ నెఱింగి వేఱైనచింత
మాని భజింతురు మానవశ్రేష్ఠ
మాని జితేంద్రియుల్ మానితవ్రతులు
అయిన కొందఱు సత్సమాధి చింతనులు
అయినన్ను విడక నిత్యముదలంచుచును

మహానీయభక్తి నమస్కరించుచును
బహుతరంబుగనన్ను భజియించుచుంద్రు
అనఘ కొందఱు జ్ఞాన యజ్ఞంబుచేత
నను యజించుచు నిరంతరము సేవింతు(రు)
ఒకడను భావంబు నూని కొందఱును
ప్రకటించి వేరుభావమున కొందరును
నానావిధముల కొందఱు నన్ని మొగల
ఆసనంబులతోడ నమరువానిగను
తొడరి సేవించుచుందురు ధనంజయుడ
ప్రథమ జ్యోతిష్టోమ ముఖములునేను
ఖ్యాతిజెందిన స్మార్త కర్మంబునేను
పైతృకాన్నమునేను పరమౌషధంబు
నేను మంత్రంబేను నేనెయాజ్యంబు
నేను హోమక్రియ నేనెయగ్నియును
జనకుడనేనె యీజగమునకెల్ల
జననియునేనె విశ్వఫల ప్రదుండ
నేనె నేనెఱుగంగ నిహితవస్తువును
నేనె పావనవస్తు వేను ప్రణవము
నేనె ఋగ్వేదంబు నేను సామంబు
నేను యజుర్వేద మింద్రాంశభవుడ
గతికర్మఫలపోషక స్వామిసాక్షి

కృతనివాసము లాశ్రయింపగాదగిన
చేతనాభేదంబు చిరసుఖోత్పత్తి
నీతత్త్వయస్థితి నిక్షేపములును
రూపఱని జగత్ప్రరోహ కారణము
ఓపార్థ నేనని యూహించుకొనుము
సృష్టినేనె తపింప జేయుచున్నాను
వృష్టినేనె వర్షించుచున్నాను
వారిలెడు వానను వారింతునేను
స్థూలసూక్ష్మములు మృత్యువుజీవనంబు
నేనెయగుచును నను న్సేవింత్రుబుధులు
పూని వేదత్రయంబు నెఱింగియెవరు
సోమపానముచేసి శుద్ధపాపులయి
భూమి నగ్నిష్టోమముఖ యజ్ఞములను
ననుభక్తి బూజించి నాకలోకగతి
గనగోరుదురో వారకల్మషంబైన
దివిజేంద్రలోకమొంది కిరీటియందు
దివిరి యప్రాకృతదేవభోగముల
వ్యాజముల్లేనివి యనుభవింతురదరు
ఆజనుల్విస్తారమగు స్వర్గసుఖము
అనుభవించి నిజపుణ్యక్షయంబైన
మనుజలోకమునకు న్మరలవచ్చెదరు

మహినిట్లు వేదకర్మము నాశ్రయించి
బహువిషయంబుల వాంఛించు జనులు
గమనాగమనముల గావించుచుందురు
అనురెడు నాకంటె నన్యదైవముల
కనదుపాసనలేమి గన్నె యేజనులు
ననుస్మరించుచునుండి నను భజించెదరొ
అతిసమాహితచిత్తులగు సజ్జనులకు
అతులయోగక్షేమ మొందించుచుందు
ధరణి నేజను లన్యదైవభక్తులయి
పొరసిన యాస్తిక్యబుద్ధితో గూడి
తవిలి భక్తి యజించెదరొ యట్టిజనులు
అవని మోక్షప్రాపకాభావవిధియె
పూర్వకంబుగ నన్నె పూజింపుచుందురు
పర్వ శ్రౌతస్మార్తవరకర్మములకు
భోక్తయు ప్రభువునై పొలుతు నేనెకద
ఉక్తయాథార్థ్యసంయుక్తి చేనెవరు
నన్నెఱుంగరొ వారు నరలోకమందు
మున్ను కృతావిధి పూర్వకంబైన
యాగఫలంబును నందకుండెదరు
బాగుగ దేవతావ్రతులైనవారు
దేవతలంబొంది తేజరిల్లెదరు

సాంపిత్ర్యమున పితృవ్రతులైనవారు
పితృదేవతలఁజేరి వెల్గుచుండెదరు
హితభూతపూజల నింపొందువారు
అనుగమింతురు వినాయకాది భూతముల
నను యజించినవారు నన్నె పొందెదరు
నాకొరకెవ్వఁడెంతయు భక్తితోడ
ఆకునైన ప్రసూనమైన పండైన
సలిలంబునైన నొసంగుచున్నాఁడొ
కలితపావన బుద్ధి గలవాని చేత
మానితభక్తి సమర్పితంబైన
దానినే భుజియించెదను పాండుతనయ
దేనినొనర్తువో దేనివ్రేల్చెదవో
దేని భుజింతువో దేని నిచ్చెదవో
దేనితపింతువో దివిజేంద్రపుత్ర
దానిని నాకర్పితంబుగావింపు
ఒగిని నీరీతి త్యాగోపాయసహిత
మగు నాత్మతోడ శుభాశుభరూప
ఫలములుగల పుణ్యపాపవికార
కలితకర్మాఖ్య శృంఖలములనుండి
విడువంగబడెదవు విడువంగబడిన
తడయక నను జెందెదవు ధనంజయుడ

సకలభూతములందు సముడను నేను
ఒకడైన ప్రియుడప్రియుడు నాకు లేడు
ఎవరు ననున్ భజియించుచున్నారో
అవనివారుంద్రు నాయందు భక్తిమెయి
వసియింతునేను నాభక్తులయందు
వసుధదురాచారవంతుడై యున్న
అజుడగు నాకంటె నన్యదేవతను
భజియింపకుండినవాడయి నన్ను
నుడుగక భజియించుచుండెనే న్వాడు
కడుసదాచారంబు గలవాడైయనుచు
నెఱుగంగదగువా డదేమన్న నతడు
అతిముఱి ముక్తికై యత్నించుచుండు
ఆపురుషుండు నత్యంత వేగంబ
ఓపిధర్మమునందు నుండు మనస్సు
గలవాడెయగును చక్కంగ నిత్యమును
పొలుపగు నుపశాంతి బొందుచునుండు
వ్యక్తంబుగ ధనంజయా యస్మదీయా
భక్తుండు చెడడని ప్రతినగావింపు
కడునీచజన్మంబుగల మనుష్యులును
పడతులు వైశ్యులు పతితశూద్రులును
ననునాశ్రయించి యున్నతమైనగతిని

గనుచునుండెరిగదా గాండీవధరుడ
వరభక్త రాజర్షి పావన ద్విజులు
గరిమ మహిమాత్మ్యాప్త గతిని బొందెదరు
అనిచెప్పనేల నిత్యంబు గానిదియు
గన నించుకేని సుఖంబు లేనిదియు
నైన యీలోకంబునందుండి నీవు
పూనినన్ను భజింపు పురుషాగ్రగణ్య
మనసు నాయెడ నిల్పి మలయు వాడవును
మనుజులలోన మామక భక్తుడవును
చిరనమస్కృతి నాకు సేయువాడవును
పరమార్థ చింతన బరగువాడవును
అగుమీవిధమున నాయందు సంప్రీతి
జిగిమీఱ మనసును జేర్చి నాయందు
నను జెందగలవు పాండవవీరవర్య
అనుచు క్రీడికి జెప్పె యదువల్లభుండు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయు శ్రీ సూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
•కనపంద్రకంటి వేంకటశాస్త్రికృతము

రమ హరిసూక్తి తరంగిణియందు
అమలిన రాజ విద్యారాజగుహ్య
మనుయోగమిదితొమ్మిదవతరంగంబు
దనర నీకిది యర్పితంబౌను గాత
నిహతా హితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీరస్తు.

# హరిసూక్తి తరంగిణి.

## విభూతియోగము.

### దశమ తరంగము.

శ్రీవేంకటక్షోణిభృద్ద్వారాగార
సావధానమున నీవాలింపునన్ను
పిదప పార్థునకు గోవిందుడిట్లనియె
ముదమున నాలకింపుము దీనివిజయ
పరమసంతోషంబు పడుచున్ననీకు
పరికించి మేలొనర్పగ కోర్కెచేత
అలఘు తరోత్కృష్టమైన యేపలుకు
పలుకంగగలనో యాపలుకును వినుము
అభయ భృగ్వాది మహర్షులు నాదు
ప్రభుశక్తి మహిమ నోపరు తెలియంగ
దేవతలైనను దెలియంగలేరు
దేవతలకు సర్వదేవర్షులకును
పరమర్షులకును సర్వప్రకారముల
నర్థయుంగ నేనాదియైన వాడగద

మొదలును లేకయు పుట్టువు లేక
పొదలి లోకసమూహము న్నియమించు
నను నెవ్వఁడెఱుఁగునో నరులందు వాఁడు
అనభిజ్ఞతా శూన్యుఁడగుచు నశేష
వివిధ పాపములచే విడువంగ బడును
అవిరత బోధ దార్ఢ్యంబు జ్ఞానంబు
అంతరింద్రియ నిగ్రహంబును సుఖము
సంతాపమును నోర్పు సత్యంబు భయము
బహిరింద్రియ జయంబు భయము లేమియు న
అహింస మోహము లేమి యధిక దుఃఖంబు
తపమహింసయు సమత్వము నాశనంబు
అపకీర్తి కీర్తియు హర్షమునీగి
ఈవిధి ప్రాణులకెల్ల బుద్ధ్యాది
భావముల్ నన్నుండె బహురీతిగలుగు
ఆదిని ఋషులు భృగ్వాదు లేడ్వురును
తాదృశుల్ నలువురు తాపసోత్తములు
సనకాదులును మరి స్వాయంభువాది
మనువులు మద్గతామల భావనులయి
మనసున జన్మ సంప్రాప్తులై మనిరి
వినుమీజగంబున వీరలవలన
ఈచరాచర రూపవ్యక్తమైన ప్రజలు

వైచిత్ర్యముగ సంభవం బొందిరప్పుడు
భువియందు నీనావిభూతి యోగమును
ఎవడు యథార్థత నెఱుగుచున్నాడో
వాఁడు చంచలయోగ బలయుక్తుడగును
క్రీడి నీకిఁక లేదొకింత సంశయము
జగములకెల్లకి నేను జన్మకారణుఁడ
జగమెల్ల నన్నుండి సాగుచున్నయది
అని తలంచి బుధుల్ మహాభావయుక్తి
చెనసి వారలునన్ను సేవించుచుండ్రు
నాయందు సక్తమానసులైనవారు
నాయందునిడిన ప్రాణంబులుగల్గి
నను ప్రకీర్తింపు చెంతయు సంతసింత్రు
అనయంబు రమియింతు రర్జునావినుము
శాంతకారణయోగ సంయుక్తులగుచు
ప్రీతి పూర్వకముగా దృఢత సేవించు
వారికాజ్ఞాన సంబంధయోగమును
వారక యొసగెద వారు తద్బుద్ధి
యోగంబుచేత నన్నొందు చుండెదరు
బాగుగ వారినేవడికరుణింప
స్వాశయస్థుఁడ నేను భాసిల్లుచున్న
పేశలజ్ఞాన శోభి ప్రదీపమున

అవివేకజంబైన యంధకారమును
దవ్వు దవ్వుల నశింప దరుముచుండెదను
అనుచు గృష్ణునకు నిట్లనియె నర్జునుడు
అనుపమం బుత్కృష్టమైన బ్రహ్మంబు
ఉత్కృష్టతేజంబు నుత్కృష్టపూత
ముత్కృష్టుడవునీవె యురగేంద్రశయన
నిన్ను బూరుషునిగ నిత్యునిగాను
ఉన్నతి వెల్గుచు నున్నవానిగను
భూశంస్యసురలలో మొదటివానిగను
లేశమేజన్మంబు లేనివానిగను
అసమప్రభునిగ దివ్యముని నారదుడు
అసితుండు నాజనునట్టి దేవలుడు
వ్యాసమౌనియు వసిష్ఠాద్యృషివరులు
వాసిగనందరు వచియించుచుంద్రు
అత్తెఱంగున నె యత్యాదరంబొప్ప
ఇత్తఱినుడివితి వీవు నాతోడ
ఏమంజుతరవాక్య మీవు పల్కితివో
దామోదరుడ యదంతయు సత్యమనుచు
తలచుచుంటిని భవన్మహిమ మెంతయును
తెలియజాలరుగదా దేవదానవులు -
ప్రాణులకభివృద్ధి నందించువాడ

ప్రాణుల నియమించువాడ దేవేశ
పురుషోత్తమా సర్వభువనాధినాథ
వరద శ్రీకృష్ణ శ్రీవర వాసుదేవ
మాన్యజనావన మానవలెనీవు
అన్యగురూపదేశాపేక్ష లేక
నీవు నీచేతనే నిన్నెఱుంగుదువు
కావున నాత్మీయ కలితమాహాత్మ్య
విస్తారములును శోభించుచుండుగద
నిస్తులంబైన నీనిజమాహాత్మ్య
విస్తారముల నీవు వివేకలోకముల
విస్తరింపగ నీవు వెలయుచున్నావొ
వినుత తన్మాహాత్మ్యవిస్తారములను
అనవశేషత దెల్ప నర్హుండ వీవు
నేనెట్లు వనజాక్ష నిన్ను సంతతము
ధ్యానించుచుం దెలియంగ నోపుదును
పూని యేయేవస్తువులయందు నిన్ను
ధ్యానించుటకు నర్హుడౌదువు నాకు
భూనుత్త్య నీయోగమును విభూతియును
విస్తరంబుగ మఱి వివరించి చెప్పుము
తావక సూక్త్యమృతము శ్రవణాంజలుల
ద్రావిన నాకింక దనివి లేదుగద

అనిన కృష్ణుడు క్రీడి కనియె నిబ్బంగి
అనఘ యోయి ధనంజయా స్వీయమైన
సరళమాహాత్మ్యవిస్తారంబులేవి
పరగునోవానిని బ్రాధాన్యముగను
విస్తరించెదను మద్విషయమాహాత్మ్య
విస్తారమునకు నెవ్విధి మేరలేదు
ఏనెల్ల ప్రాణుల హృదయంబులందు
ధ్యానింప యోగ్యుండనై యున్నవాడ
మానితంబగు పరాత్మస్వరూపుడను
ప్రాణులకాదికారణము సంస్థితియు
భేదంబునే నవిచ్ఛేదనై ఖరిని
ద్వాదశాదిత్యమధ్యమున విష్ణుడను
జ్యోతిస్సులందు నంశుపరాజి రవియు
మాతరిశ్వుల నడుమ మరీచినేను
సాంద్ర తారలయందు చంద్రుండు నేను
ఇంద్రియంబుల మానసేంద్రియంబేను
సరిచేతనుల సాక్షిచైతన్యమేను
సరసులలోపల సాగరంబేను
సర్వదేవతలందు శక్రుండు నేను
పర్వతంబుల మేరుపర్వతంబేను
సకలరుద్రులలోన శంకరుండేను

ప్రకటవసువులలో పావకుండేను
వేదంబులను సామవేదంబు నేను
చీదరవిడి విస్మ సేనానులందు
రాక్షసఘ్నుడు కుమారస్వామి నేను
యక్షరాక్షసులందు నర్థేశుడేను
సురపురోహితులం దసామాన్యుడైన
గురుని నన్నుగ నెఱుంగుము సవ్యసాచి
సకలవాక్యములందు శ్లాఘింపబడుచు
ఒక యక్షరంబైన యోంకారమేను
హితమహర్షులయందు భృగుమౌని నేను
శతయజ్ఞములలోను జపయజ్ఞమేను
నిఖిల స్థిరములందు నీహారగిరియు
అఖిలవృక్షములందు నశ్వత్థమేను
అనిమిషర్షులయందు నమరు నారదుడ
ఘనచిత్రరథుడేను గంధర్వులందు
అనుపమాశ్వములలో నమృతంబుతోడ
జనియించినట్టి యుచ్చైశ్శ్రవస్సు
క్రమత సిద్ధులలోను కపిలుండు నేను
రమణీయకరుల నైరావతంబేను
మహింగల నరులలో మనుజేంద్రుడేను
ప్రహరణంబులలోను వజ్రంబు నేను

ధేనువులన్ గామధేనువు నేను
ప్రాణుల బుట్టించు (ప్రసవాస్తు) కేను
జనితసర్పములలో వాసుకి నేను
అలఘు నాగులలో ననంతుండు నేను
పరిశుద్ధికరులలో వాయువు నేను
వరధనుర్ధరులలో పల రాముడేను
పఙ్తదైత్యులయందు ప్రహ్లాదుడేను
గణియించువారిలో కాలంబు నేను
మహామత్స్యములందు మకరంబు నేను
మహానదుల నిర్మలగంగ నేను
ఆదినుండియు సాగు నఖిలసృష్టులకు
ఆదిమధ్యాంతంబులన్నియు నేను
చోద్యంబులై పరిశుద్ధంబులైన
విద్యలందధ్యాత్మవిద్యయు నేను
ఆదట సత్యప్రియన్యాయరీతి
వాదించువారల వాదంబు నేను
కలిశాక్షరములం దకారంబు నేను
వెలయుచుండు సమాస విసరంబునందు
భయరహితుండ ద్వంద్వసమాసమేను
క్షయము నొందకయుండు కాలంబు నేను
తలపగర్మఫల ప్రదాయకుండైన

నలుమొగంబుల వేల్పు నలినజుండేను
ఎఱియునుహరియించు మృత్యువు నేను
ఉదయింపగలవారి యుత్పత్తి నేను
లలనలలోకీర్తి లక్ష్మియు వాకుఁ
తెలివియు బుద్ధియు ధృతియోర్పు నేను
అలరు సామములన్ బృహత్సామమేను
కలిత ఛందస్సుల గాయత్రి నేను
క్షితిమాసముల మార్గశీర్షంబు నేను
ఋతువులందు వసంతఋతువును నేను
ఒఱసి వంచించు మర్త్యులజూదమేను
తెలియ తేజస్వుల తేజస్సు నేను
ప్రవరసాత్త్వికుల సత్త్వగుణంబు నేను
వ్యవసాయమును విజయంబును నేను
భావింప యాదవ వంశ్యులలోన
ఈవాసుదేవుఁడై యొసగువాడేను
క్షితిపాండవులలోను క్రీడివీ నేను
అతులితమునులందు వ్యాసుండు నేను
కవులందు భార్గవ కవియును నేను
భువిని దండించు భూపులదండమేను
విజయేచ్ఛగలవారి పృథునీతి నేను
ప్రజగోప్యముల మౌనభావంబు నేను.

జ్ఞానవంతులయొక్క జ్ఞానంబునేను
పూనినమేదియశేష భూతప్రరోహ
కారణమైనదో గననదియేను
ఆరయగ జరాచరాత్మకమైన
ప్రాణిజాతంబు నావలనగానిదియు
ఈనేలగలదేదో యెందదిలేదు
ధీస్తుతమామక దివ్యమాహాత్మ్య
విస్తారములకు నుర్వినిమేరలేదు
పూనియర్జున యీవిభూతి విస్తరము
నేనుసంగ్రహముగా నీకుజెప్పితిని
జగమునందైశ్వర్య సంయుక్తమగుచు
జిగినొంది యుత్సాహ సిద్ధితోగూడి
యేయేపదార్థ మెయ్యెడనొప్పుచుండు
నాయాపదార్థంబు నస్మదీయమగు
తేజోంశజంబైనది యటంచు నెఱుగు
రాజజ యీప్రకారంబుగాకున్న
ఈతెల్విచేత నీకేమి కార్యంబు
ఏతత్త్రియంబదేనే యేకపాదమున
అనసర్వభూతచయ స్వరూపమున
అనవశేషంబుగా నఖిల మీజగము
వ్యాపించియుంటిని పాండుకుమార

ఈపరమాత్మకు నెల్లజగంబు
ఒకపాదమని శ్రుతియుం జాటుచుండె
ఇక నెఱుంగుమనె నాకృష్ణుఁ డర్జునుని
అని ధృతరాష్ట్రున కా సంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీ సూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
ఘనపద్యపదంబు విభూతియోగంబు
అనబడు నిది పదియగు తరంగంబు
దనరె నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీ ర స్తు.

## హరిసూక్తి తరంగిణి.

## విశ్వరూప సందర్శన యోగము.

### ఏకాదశ తరంగము.

శ్రీతరుణ్యావన దుష్కృతతూలపవన
ఖ్యాతి పూర్ణభువన వేంకటశైలభవన
ప్రణుత దయారసార్ద్ర కటాక్షకలన
గనుచు నామనవి యాకర్ణింపుమిపుడు
అమితభక్తిని క్రీడి హరికిట్టులనియె
కమలలోచన నన్ను గరుణింపగడగి
అరసియుత్కృష్టమై యతిరహస్యముగు
పరగునాత్మానాత్మవస్తువివేక
విషయమేవాక్యమోపి వచింపబడెనో
విషమమైన మదీయ విపులమోహంబు
పరిహరింపబడె నవ్వాక్యంబుచేత
సరసిజాతదళాక్షసరణి దప్పకయె
ప్రాణులయుద్భవ ప్రలయసంగతులు
నేను నీవలన వింటి సవిస్తరముగ

భవదీయమాహాత్మ్యభంగియున్ వింటి
అవునిది యిట్లె వ్యత్యాసంబులేదు
రూపించి యాత్మస్వరూపమేపగిది
చూపి చెప్పితివా యామాటికి నీవు
నేదైశ్వరంబైన నీస్వరూపంబు
జూడగోరుచునుంటి సుజనమందార
ఆరూపముగన నాకలవియా ననుచు
ధీరత నీకు మదిందోచెనేని
తదనంతరము నిరంతరముగా నింక
పొదలు నీరూపు జూపుము పుణ్యపురుష
అనవుడు కృష్ణుడిట్లనియె బార్థునకు
అనఘ పెక్కు విధంబు లప్రాకృతములు
వివిధవర్ణంబులు వివిధంబులైన
అవయవస్థితి విశేషాకృతుల్ కలిగి
శతముల మఱివేల సంఖ్యలై యొప్పి
ప్రతిలేని నాదురూపములు దర్శింపు
భద్రప్రభానిధుల్ పన్నిద్దరినలు
రుద్రులు పదునొకండ్రును రౌద్రముఖులు
ఎనమండ్రు వసువులు నేడువాయువులు
తనరు నశ్విని దేవతలు వారిరువురు
చూడుము వీరి నర్జునుడ యెన్నడును

౧౪౨ విశ్వరూపసందర్శనయోగము.

చూడనీవన్నియు సొరదిగా నీవు
పరమాద్భుతంబులు పరికింపు నేడు
స్థిరచరంబులతో నశేషజగంబు
ఈనాశరీరమం దేకభాగమున
స్థానంబుగానున్నదానిగా దలచి
ఏది దర్శింపగ నిచ్ఛగించెదవొ
సాదరంబుగ దాని నంతయుంగనుము
ప్రాకృతంబైన యీస్వనేత్రమున
నీకు నన్వీక్షింప నేర్పుచాలదు
ఇదె దివ్యదృష్టి నీకిచ్చుచున్నాను
అది గనుగొనుము నాయైశ్వరశక్తి
నని కృష్ణువాక్యంబు నాసంజయుండు
వినజెప్పి ధృతరాష్ట్రవిభునకిట్లనియె
ధృతరాష్ట్ర యధికంబయిన యోగములకు
పతియైన కృష్ణుడీవైఖరింబలికి
ఊరడించుటగాక యొక్కొకవ్వడికి
ఊరకయుండక యుత్కృష్టతరము
ఈశ్వరసంబంధ మిష్టంబునైన
విశ్వరూపము జూపె విజయునకప్డు
పెక్కుమొగంబులు పెక్కుకన్నులును
చక్కనైనది మహాశ్చర్య దర్శకము

బహుదివ్యభూషణ భరితమైనదియు
బహుళదివ్యోద్యత ప్రహరణాంచితము
దివ్యమాల్యాంబర దీప్తమైనదియు
భవ్యమాల్యానులేపనశోభితంబు
సంతతానేక విస్మయరూపయుతము
అంతట మొగముల నతిభాసితంబు
అంతంబులేనిదియగు భగవంతు
వింతరూపంబును విజయుండుగాంచె
ఆకసంబందు సూర్యసహస్రకాంతి
ఏకకాలమునందు నెగయునో యద్ది
ఆకాంతియే యామహాత్ముని కాంతి
యాకృతితుల్యమై యమరగావచ్చు
బహువిధంబులచేత బ్రవిభక్తమైన
మహిత సర్వజగత్తు మాధవుమేన
ఒకప్రక్క నిమిడిక నున్నదానిగను
ప్రకటంబుగానప్డు పార్థుండుగనియె
తదనంతరము కపిధ్వజుడక్కజంబు
నెదగలవాడయి హృష్టరోముడయి
విశ్వరూపముదాల్చి వెలుగుశ్రీకృష్ణు
విశ్వసించి శిరంబు వేగంబ వంచి
ప్రీతితోడ నమస్కరించి కేల్మోడ్చి

ఈ తెఱంగున వచియించె నర్జునుడు
దేవ దేవా భవదీయ దేహమున
దైవతబృందంబు దర్శించుచుంటి
ప్రభతోడ భాసిల్లి పద్మాసనమున
ప్రభువైన బ్రహ్మను ప్రాణికోటులను
భాసురర్షులను దివ్యంబులై యున్న
వాసుకిప్రముఖ సర్పముల నీక్షింతు
విశ్వనియామక విశ్వరూపధర
అశ్వరంబులుగా కనంతంబులైన
భుజములు నుదరముల్ ముఖములతోఁ గనులను
వ్రజములై గల్గినవాని నిన్నన్ని
వలగులనమితరూపంబులుగల్గి
యొలయు వానిగ జూచుచున్నాను మరియు
ప్రోదిగ నీవిశ్వరూపమూర్తికిని
ఆదిమధ్యాంతంబు లరయ గన్పడవు
కాంత కిరీట చక్రగదాభియుక్తి
కాంతిపుంజముగాన గడలయందెల్ల
కడుప్రకాశము గల్గి కష్టంబుచేత
తడపునకు గన వింతగ శక్యుడవగు
తేజరిల్లుచునున్న తీక్ష్ణాగ్నిరవుల.
తేజంబువంటిది తేజంబు గల్గి

చెన్నుమీఱ నపరిచ్ఛేద్యుండ వైన
నిన్ను జూచుచునుంటి నేనెల్ల యెడల
పరికింపనగు పరబ్రహ్మమీవయని
పరమాశ్రయంబు విశ్వంబునకీవ
శాశ్వతధర్మ రక్షకుడవు నీవ
అశ్వరత్వము లేని యాతండవీవ
పొనరుచున్న పురాణపురుషుండ వీవ
• యనినామతంబు సత్యము వాసుదేవ
ఆదియు మధ్యంబు నంతమున్ లేక
మేదురంబై యప్రమేయవిక్రమము
కలిగి పెక్కులు బాహుగణములు గల్గి
సలలితచంద్రార్క చక్షువుల్ గల్గి
మండుచుండిన యగ్నిమంటయో యనగ
నుండిన మొగముతో నుద్దాము నిన్ను
విపులస్వతేజోభివృద్ధి నీజగము
తపియింపజేయుచుం దనరువానిగను
వీక్షించుచుంటిని విశ్వంభరుండ
ఈక్షణంబందు నీయేకరూపమున
• రోదసి నడుమ నిరుద్ధమయ్యెగద
పోల్దిగ దిశలందు పూర్ణమైయుండె
ఆశ్చర్యధుర్యమై యత్యుగ్రమగుచు

విశ్వరూపంబుగను నీనీయిట్టిరూపు
లోకముల్ మూడు నాలోకించి కృష్ణ
వ్యాకులితంబయి భయపడుచుండె
ఈభీమయుద్ధమం దేతెంచియున్న
భూభారవారణంబునకు మర్త్యులయి
వసుధజన్మించిన వస్వాదిదేవ
విసరముల్ నిన్ను బ్రవేశించుచుండె
వారిలో కొందఱు భయనియుక్తులయి
భీరుత కేల్మోడ్చి కీర్తించుచుండ్రి
శ్రీస్తుతుండ మహర్షి సిద్ధసంఘములు
స్వస్తియగాకని సంపూర్ణమైన
స్తుతులచేతను నిన్ను స్తుతియించుచుండె
అతులితప్రతిభాఢ్య యతిసంతతీడ్య
వసువులు నెనమండ్రు ద్వాదశాదిత్యులును
అసమ రుద్రులు సాధ్యు లాశ్వినేయులును
అసురగంధర్వ యక్షామరసిద్ధ
విసరంబులును సర్వపితృదేవతలును
వీరలందఱుగూడి విస్మితులగుచు
చేరువ నిన్ను వీక్షించుచున్నారు
బహువదనంబులు బహులోచనములు
బహుబాహుదండముల్ బహుళోరువులును

బహుచరణంబులు బహూళోదరములు
గ్రహియింపబడి విచిత్రప్రకారమయి
పెక్కుకోరలచేత భీకరంబగుచు
అకరాళంబైన నీయాకృతింగాంచి
ప్రాణులందఱు భయంపడుచున్నారు
నేను నారీతి చింతించుచున్నాను
ఆకాశమండలంబంటిమండుచును
ప్రకటానేకవర్ణంబులుగల్గి
ప్రోజ్వలద్వివృతాస్యపుంజముల్ గల్గి
ప్రజ్వలద్దీర్ఘనేత్రంబులుగల్గి
వెలుగుచుండెడి నిన్ను వీక్షించుచుంటి
తలఁగనిభీతచిత్తము గల్గునేను
అదరుచుధైర్యంబు నందకున్నాను
ఏవరి మనస్తుష్టి జెందకున్నాను
కోరలచే భయాంకురకారణములు
ఘోరకాలాగ్నులతో సమంబులైన
పెక్కు నీముఖములన్ వీక్షించిమిగుల
దిక్కేన నేదిక్కు దెలియకున్నాను
ఎంతేని సౌఖ్యంబు నెఱుఁగకున్నాను
వందిమాన్యు జగన్నివాస దేవేశ
నిరుపనాకు ప్రసన్నుండవగుము

౧౩౮. విశ్వరూపసందర్శన యోగము.

ధరణీశసంఘయుక్తముగనందఱును
ఈ ధార్తరాష్ట్రులు నీశాంతనవుడు
రాధేయు డరు పరాక్రముడు ద్రోణుడును
నాదుసంబంధులున్నతవీరులరుల
మోదు ధృష్టద్యుమ్నముఖ యోధవరులు
తొట్టి దుర్యోధనాదులు వేగపడుచు
బెట్టైన కోరల వికృతముల్ భీతి
కరమూలౌ నీదు వక్త్రములలోపలను
చొరపడుచున్నారు సూ వారలంతు
కొందఱు శతకోటి ఘోరదంతముల
సందులగొందుల చక్కగజిక్కి
పొడిజేయబడు శిరంబులతోడజూడ
బడుచునువ్నారదే భయదస్వరూప
బహువాహినీ భూరి వారివేగములు
మహదబ్ధికెదురుగా మరలి యేకరణి
చేరి వార్ధిని ప్రవేశించుచుండినవా
ఆరీతి నీవీరు లగువారలెల్ల
నెలవుల విలసిల్లు నీవక్త్రగుహల
చెలరేగుచుం బ్రవేశించుచున్నారు
మిడుతలాకుక్రమ్మతి మృతినిబొందుటకై.

అడరిన వడిగలవై మండుచుండు
భీకరానలముం బ్రవేశించునట్లు
లోకులు నిర్గతాలోకులై వేగ
నీల్గుట కురువడి నీదువక్త్రముల
వెల్గుచునుండం బ్రవేశించుచుండ్రు
ఘనుకొనిమండు నీముఖములచేత
జనులగుంపుల నొక్కసారి మ్రింగుచును
ఎల్లెడ రుచిచూచుచెసగుచున్నావు
కొల్లగ తావక ఘోరంబులైన
స్ఫుటిత దీధితులు తేజోరాజిచేత
తటుకున భువనమంతట నిండియుండి
స్థిరముగ దపియింప జేయుచున్నయవి
శరణు నీకిదె నమస్కారమౌగాక
జలజాక్ష నాకుం బ్రసన్నుండవగుము
తెలియదు నీప్రవృత్తి యొకింతయేని
ఇంతఘోరాకృతి వెవ్వాడవీవు
అంతయు నాద్యుండవౌ నిన్నునేను
తెలియగోరుచునుంటి తెలుపుము నాకు
జలరుహనాభ భాస్కర సహస్రాభ
అనుచు కృష్ణుండిట్టులనియె బార్థునకు
వినులోకమడపన్ బ్రవృద్ధమైయున్న

౧౫౦ విశ్వరూపసందర్శనయోగము.

కాలంబు నేను లోకములం గ్రసింప
ఈలీలనిపుడు ప్రవృత్తుండ నైతి
ప్రతి సేనయందును బ్రతిపక్షులగుచు
కృతులయి పోరగా నెవ్వరున్నారొ
వారెల్ల బ్రతుకనోపరు నీకుదప్ప
కౌరవ శ్రేష్ఠ తత్కారణంబున నె
కదు వేగ యుద్ధంబు గావింప లెమ్ము
తొడరి దుర్యోధనాదుల నీవు గెల్చి
గనుము యశంబు నిష్కంటకంబయిన
అనుపమ రాజ్యమి వనుభవింపుమిక
భారత యీనీదు పగవారు మున్నె
దోరింపబడిరి నాదు దృగాయుధముల
గాన నీవు నిమిత్త కారణంబగుము
ధీనిధి భీష్మ రాధేయ సైంధవులు
ద్రోణుండు నితర యోధులును నాచేత
పాణమానా ప్రవలంబనులు గాము న్నె
హరింపబడిరి యీ యోధుల నెల్ల
వెనుదీయక జయింప వెరవు జెందకను
కలను గావింపుము కలహమందరుల
గెలువంగ గలవు శంకింపగావలదు
అని హరి పలికిన పల్గాని కేశవునకు

వెన్నుండ నాశన విరహితంబగుచు
ఉన్నదిలేదను నుభయంబునకును
పరమైనదేది యావస్తువునీవె
పరిమితిలేని రూపము గల్గువాడ
ఆదిదేవుడవీవె యతిపురాతనుడవు
నా దనరు పురుషుండవు నీవెస్వామి
పరజగదాధారవాచ్యుండ వీవె
పరమేశ్వరుడవీవె పరమాత్మవీవె
తెలిసినవాడవు తెలియంగదగిన
యలఘుపదంబీవె యఖిలవిశ్వంబు
నిండింపబడియుండె నిశక్తిచేత
దండధరుండు సుధాకరుండగ్ని
వరుణుండు వాయువు బ్రహ్మ తప్పితయు
అరసిన నీవైతివయ యందువలన
మఱినాటి నీకు వేమార్లు మొక్కెదను
మఱియు నేమ్రొక్కెద మఱియుమ్రొక్కెదను
ఎదుటను వెనుకను నెల్లదిక్కులను
ఇదె నీకుమ్రొక్కెద నింద్రాదిదేవ
అమిత సామర్థ్యంబు నమితవిక్రమము
నమరిన నీవె యీయఖిలజగంబు
నిండియుంటివి గాన నిఖిలరూపుడవు

కుండలీంద్ర శయాన గురుగీయమాన
విమల నీవయిన యీవిశ్వరూపంబు
క్షమనీమహిమ మెఱుంగమిని నాచేత
చనువుననైన నజ్ఞతచేతనైన
అసశంబు చెలికాడవనుచు నేదలచి
ఓయోయి కృష్ణుడ యోయి స్నేహితుడ
ఓయాదవుడయని యుల్లంఘనముగ
కీడు బలాత్కారంబుగా నెట్టివాకు-
నుడువంగబడెనో మున్నుగ దాసినైపు
స్వామినాచే నీవు పరిహాసమునకు
వేమారులందందు విహరించునపుడు
శయనకాలమున భోజనకాలమందు
ప్రియమునగూర్చుండు వేళలయందు
అవమానితుడవైతి వను నేదిగలదో
కవిరాజనుత యది గాకపోయినను
అరయ నీవు పరోక్షమైన వాడవయు
అరిధి తత్ప్రత్యక్షమందైన గాని
అవమానితుడవైతివను నేదిగలదో
కవిసి యవ్యాపరాధ కరణంబుగూర్చి
అప్రమేయుండవై యమరుచునుండు
నప్రాకృతుని నిన్ను బ్రార్థింతునైప

౧౫౮ విశ్వరూపసందర్శన యోగము.

ఖ్యాత ప్రభావ చరాచరరూప
మై తేజరిల్లు నీప్రాణిసంతతికి
జనకుడవును సమర్చకు నర్హుడవును
అనఘ గురుండ వీవైతివిగాన
మూడులోకముల నిన్బోలినవాడు
లేడు నీకధికుండు లేడన్యుడొకడు
గాన సాష్టాంగంబుగ నమస్కరించి
నేనుని యీమకు నిఖిలనుత్యార్హ
నిన్ను ప్రసన్నాత్మునిగ జేసికొనుదు
మిన్నకసుతు నేరమిని దండ్రివలెను
చెలికాని నేరమి చెలికానివలెను
అలప్రియురాలి కృతాపరాధమును
ప్రియువలెనాతెప్పు ప్రీతిమైసైప
స్వయదూర మేయవసరము నంద్రైన
వీక్షింపనట్టి యీవిశ్వరూపమును
ఈక్షించి యత్యంత మెలమి బొందితిని
నామనంబు భయంబున జలింపబడియె
ఆమొదలింటి నీయాకారమీవు
నాకు జూపుము జగన్నాథ దేవేశ
నాకు ప్రసన్న మనస్కుండవగుము
వేయుబాహువుల నొప్పిన విశ్వమూర్తి

పాయనిమార్తితో భాసిల్లువాని
గదగలవాని జక్రసమేతహస్తు
వదన పద్మజిత శుపాకరునిన్ను
గనగోరుచున్నాను గావున నిప్పుడు
వనజోదరా చతుర్బాహుపెల్లల్లు
మనుపటి నీరూపమును దాల్పవయ్య
అనుచు మురారి యిట్లనియె బార్థునకు
దీప్తితేంద్రియ దేవదివ్య రూపంబు
తేజోమయంబైనదియు ననంతంబు
ఆద్యమైనది యుష్మదన్యునిచేత
వేద్యంబుగాని దేవేశయుండైన
మునుజూడబడనిది ముఖ్యమైనదియు
వినుమైనట్టి యీవిశ్వరూపంబు
అతి ప్రసన్నుండనైనట్టి నాచేత
అతులాత్మయోగ దార్ఢ్యంబుచేనీకు
చూపింపబడినది చూడుమిపుడయ
ఒప్ప యీవిశ్వరూపోన్నతుండనగు
నేనీజగంబున నీకంటె నితరు
డైన మర్త్యునిచేత నామ్నాయపఠన
యాగదాన తపఃక్రియాదులచేత
బాగుగదర్శింప బడనశక్యుడను

ఇట్టి భీకరముదాకృతిని జూచితివి
ఎట్టిబాధయు బుద్ధిహీనతయేని
నీకుగాగూడదు నిర్భయుండవయి
ప్రాకటసంతోష భరితుండవగుచు
నాపూర్వ రూపమందముగ వెండియును
జూపెద జూడు మచ్చుగ సవ్యసాచి
అనెనంచు సంజయుం డాంబికేయునకు
వినిపించి హరిపల్కె వెండియిట్లనియె
అని యిట్లు శ్రీకృష్ణు డర్జునుతోడ
ననుచున్ స్వకీయ పూర్వాకృతిజూపి
శాంత స్వరూపుడై జలజోదరుండు
ఎంతయు భయసమాహితుని నర్జునుని
మఱల నోదార్చె పిమ్మట ఫల్గునుండు
కఱివేల్పుగనిపల్కె గమలనేత్రుండ
స్వామి నీమానుష్య సౌమ్యరూపంబు
ఈమాడ్కి దర్శించి యిపుడు స్వస్థతను
పొందితి జైతన్యమునుగూడి ప్రకృతి
నొందియుంటిని పురుషోత్తమా యనిన
హరియును నేమదీయ స్వరూపంబు
నరసి కాంచితివా యత్యంతముంగనగ
నలవిగానట్టి యీయాకృతిజూడ

పలుమారుసురలును వాంఛించుచుండ్రు
ఎటుల నన్గంటివో యిట్టిరూపమున
పటుతరంబుగ దాల్చువాడనౌ నేను
శ్రుతులచేతను తపస్సులచేతనైన
క్రతువులచేత త్యాగములచేనైన
గన శక్యుడను గాను కౌంతేయవినుము
అనితరాసక్తమైనట్టి భక్తిమెయి
అనఘమానిట్టి విశ్వాకృతిదాల్చు
నను వాస్తవముగ గానగ వచ్చు లెస్స
తెలియంగవచ్చు ముక్తిని జెందవచ్చు
కులవర్ధనుండ నాకొరకు కర్మములు
హితవుగసలుపు వాడే నెయుత్కృష్ట
గతియు గాగలవాడు గాటంపుబత్తి
పలువిధంబులనన్నె భజియించువాడు
తలగని బంధుమిత్ర కళత్రపుత్ర
ధనసంగతుల పరిత్యక్తుండు నిలను
జననమొందిన సమస్త ప్రాణులందు
పగలేనివాడు నెవ్వడో వాడు ప్రీతి
నాగిసుఖంబుగ నన్ను నొందుచున్నాడు
వనజాక్షుడీరీతి పాండుపుత్రునకు
తన విశ్వరూపంబు దర్శింపజేసి

౧౫౮ విశ్వరూపసందర్శన యోగము.

అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణ పుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర
కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమ హరిసూక్తి తరంగిణియందు
క్షమ విశ్వరూపదర్శన సుయోగంబు
అనునిది పదునొకండవ తరంగంబు
దనర నీకిది యర్పితంబగానుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.



శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

భక్తి యోగము.

ద్వాదశ తరంగము.

శ్రీవేంకటాధీశ సేవకుండనగు
నావిన్నపము ప్రసన్నత చిత్తగింపు
కృతవైరి విజయుడవ్వేడ ధనంజయుఁడు
ప్రతిభాగ్రమతికి శ్రీపతికిట్టులనియె
ధరణి నీగతి భవత్కార్యాదులందు
పరతసమాహిత స్వాంతులైనిన్ను
వరభక్తిధ్యానించు భక్తులయందు
నిరవుగనున్న సర్వేంద్రియంబులకు
వారక గనరాని బ్రహ్మంబుచింత
బారుగఁగావించు వారలయందు
ఎవరు మిక్కిలి యోగమెఱిఁగిన వారు
వివరింపుమనుఁడు గోవిందుఁడిట్లనియె
మనము నాపైనిల్పి మరి భక్తియుక్తి
ననుపమాన శ్రద్ధనన పాయవృత్తి
అతిసమాహిత చిత్తులై నన్నుఁగోరి

ప్రథముగా ధ్యానించు వారలు నాకు
ప్రియులును దృఢయోగ విత్తముల్వార
వ్యయము లేనిది యిట్టి దనగ రానిదియు
అంతట నిండియున్నదియు సంతతము
చింతింప నెంతేనిఁ జేకూడనిదియు
రూపాది రహితంబు ధ్రువము నైనదియు
ఏపట్టున జలింప కేపారునదియు
ప్రకృతిస్థమగు పరబ్రహ్మంబు నెపుడు
నాకటిని ధ్యానించుచున్నట్టివారు
ఇంద్రియ గ్రామమెందేని గ్రహించి
తంద్రయించుకయుఁ గొందక యెల్లతఱుల
అతులిత సమబుద్ధి నలరువారలును
ప్రతిభూత హితకార్యరతులైనవారు
ఓపార్థ విను నన్నె యొందుచున్నారు
ఆపరబ్రహ్మమం దాసక్తమైన
స్వాంతంబు గలవారికది కష్టతరము
అంతంబులేని దేహాభిమానంబు
గలవారిచేత నక్షరరూపసరణి
యలవడంబడదు కష్టము గుణాంగిగాన
ఉలుకు నందును నేనె యుత్కృష్టగతిగ
గలవారలై సర్వకర్మఫలములు

ఓరి నాకర్పించుచుండి నాకంటె
నాలంబనం బన్యమమరించుకొనని
అలఘు యోగారూఢి ధ్యానించుచుండి
చెలిమి తోడను నన్నె సేవించువారు
నాయందుఁ జిత్త మంతయుఁ జేర్తురెవ్వ
రాయుక్తములను నయ్యైన మృత్యుసదృశ
మైన సంసారఘోరాంభోధినుండి
నేనుద్ధరించెద నిజముగా విజయ
నీమనోబుద్ధులు నిలుపు నాయందె
యేమరి యుండక యీమేనువిడిచి
యామీదనీవు నాయందు నిల్చెదవు
నీమది నిది నమ్ము నిస్సంశయంబు
స్థిరముగ నాయందుఁ జిత్తంబుపార్థ
తరళంబు గాకుండ స్థాపించు పనికి
కడుఁ జతురుండవు గానిచోఁ బిదప
నుడుగక యభ్యాస యోగంబుచేత
సభ్యుత నన్నుఁ జెంద పరగ వాంఛింపు
మభ్యాసయోగమం దలసుండవగున
పని పత్తి మత్కర్మ పరముడ వగుము
సతతంబు నాకుఁగా సత్కర్మములను
సలుపుచునుండి మోక్షము వొందగలవు

అలసి యీపనినైన మాచరించుటకు
సుసమర్థుడవు గానిచో ననంతరము
వెనసంయమిత చిత్తవృత్తిం బెంపొంది
బాగుగ కృతకర్మఫల పరిత్యాగ
మాగక సేయుమీ వమరేంద్ర తనయ
ఒనర నీయభ్యాస యోగంబు కంటె
ఘనమాను జ్ఞానయోగము దానికంటె
ధ్యానముత్తమమైనయది దానికంటె
మానితంబౌను గర్మఫలంబు విడుపు
దానికంటె శమంబు దార మర్జునుడ
ప్రాణులయందు వైరము లేనివాడు
క్షమ గలవాడహంకార శూన్యుండు
మమకార రహితుండు మైత్రి సంయుతుడు
సుమతి దయాళుండు సుఖదుఃఖములను
సమ బుద్ధిగలవాడు సంతుష్టుడెపుడు
యతమనోవృత్తి యుధ్యానతత్పరుడు
ధృతి బుద్ధిమనసు నాయెడ నుంచువాడు
ఈకీర్తితగుణాళి నెసగువాడగుచు
నాదు భక్తుండైన నాకు సమ్మతుడు
భయపడకుండు నెవ్వనినుండి జనము
భయమొందడు జనంబువలన నెవ్వండు

ప్రీతి భీతి క్రోధపీడలనుండి
ఖ్యాతిగ నెవడు సంత్యక్తుడై పరగు
వాడు నాకు బ్రియుండు వసుధ కౌంతేయ
ఏడని మద్భక్తి వెలుగు పావనుడు
పక్షపాతము లేనివాడవ్యథుండు
దక్షుండు కోరుకులింతయు లేనివాడు
భువి సర్వసంకల్పముల పరిత్యాగి
అవు నెవండో వాడె యస్మత్ప్రియుండు
మోదఖేదంబుల పొందమిలేక
ఏదియు ద్వేషింప కిచ్ఛలు లేక
సుగుణయుక్తిని శుభాశుభ పరిత్యాగి
యగుభక్తుడే నాకు నధికప్రియుండు
ధూతసంగుండయి స్తుతినిందలందు
శీతోష్ణసుఖదుఃఖ సిద్ధులయందు
సహిత కృతమానావమానంబులందు
స్వహితాహితులయందు సమబుద్ధి గల్గి
మౌనంబు బూని యేమాత్రంబుచేత
ఐన సంతసమందు చనికేతుడగుచు
స్థిరమతియై నన్ను సేవించుచుండు
నరుడు నాకు బ్రియుండు నరలోకవీర
కడునేనె యుత్కృష్టగతిగాగ యుండి

తడయక మోక్షప్రదంబైనయట్టి
యమృతంబుదీని నొయ్యన విశ్వసించి
రమణ నేజెప్పిన క్రమము దప్పకయె
భావించి సేవించు భక్తులందఱును
ఏవేళలందు నాకెంతయుం బ్రియులు
అని జనార్దనుడు దయారసంబుమెయి
అనువుగవచియించె నర్జునుండలర
అనిధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీ సూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
ప్రమదప్రదంబగు భక్తియోగంబు
అనునిది పదియు రెండవ తరంగంబు
దనర నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీరస్తు.

హరిసూక్తి తరంగిణి.

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము.

### త్రయోదశ తరంగము.

శ్రీవత్సవక్ష రాజీవపత్రాక్ష
క్ష్మావధూపక్ష వేంకటనగాధ్యక్ష
సహజపుణ్యశ్లోక సమరసాలోక
మహనీయ దయ నాదు మనవి యాలింపు
వాసవాత్మజుడైన పార్థుండు పిదప
వాసుదేవుని గాంచి వచియించె నిట్లు
వికచాబ్జలోచన వినుము నామనవి
ప్రకృతిని బురుష క్షేత్రమును క్షేత్రజ్ఞ
జ్ఞానంబు జ్ఞేయ మీసర్వంబు దెలియ
నేనుగోరుచునుంటి నిర్వచింపుమిక
అనవుడు శౌరి యిట్లనియె కవ్వడికి
తనరు నీతనువు క్షేత్రంబనంబడును
ఈతనువును నెవ్వ డెఱుగుచున్నాడొ
ఆతని క్షేత్రజ్ఞుఁడందురు తద్విదులు

క్షేత్రంబులన్నింట క్షేత్రవేత్తనుగ
వృత్రారిపుత్రక వెఱుగుమీసన్ను
తెలప క్షేత్రమును క్షేత్రజ్ఞునిం దెలియు
తెలివి యేదో యది తెలివి నామతము
ఈవార్త యాక్షేత్ర మెట్టిదో యేదో
ఏవికృతి గలదో యే కారణమున
ఏదికార్యము జనియించునో యదియు
అదినా క్షేత్రజ్ఞుడనగ నెవ్వాడో
వారికెట్టిది ప్రభావము గల్గువాడో
ఆరూపమును సంగ్రహముగ జెప్పెదను
నాపల్కువలన దిన్నగ నాలకింపు
వ్యాపకంబుగ వసిష్ఠాది మహర్షి
వరులచే తత్స్వరూపము పెక్కుగతుల
పరిపఠితంబయ్యె బహువిధంబులగు
శ్రుతులచే వేరుగా సూచింపబడియె
అతియుక్తి యుక్తంబు లతినిశ్చితములు
నగు బ్రహ్మసూత్ర వాక్యముల చెప్పబడె
తగ పృథివ్యాది భూతము లహంకృతియు
పిమ్మట బుద్ధి యావెనుక మాయయును
ఇమ్ముగ జ్ఞాన కర్మేంద్రియమ్ములును.
మనసును శబ్దాదిమ ద్విషయములు

అను చతుర్వింశతియైన తత్త్వములు
ధృతిసుఖంబును దుఃఖమిచ్ఛ వైరంబు
ప్రతతదేహేంద్రియ ప్రముఖసంహతియు
తతమనోవృత్తియు తత్తద్వికార
వ్రాతమిది క్షేత్రమం చెన్నంగబడును
జనులలో దను దాన శ్లాఘించుకొనమి
తను ధారులకు హింస దలపకుండుటయు
తనదైన ధర్మంబు తా జెప్పుకొనమి
జను నపరాధంబు క్షమియించుచునికి
గురుని సేవించుట కుటిలత లేమి
పరమ శుచిత్వంబు బహిరంతరముల
స్థిరధర్మమూనుట చిరమనోజయము
పరిచిత విషయాశ వదలియుండుటయు
మరణ జరోద్భవామయ బాధలందు
వరుసగా దోషంబు పరికించుటయును
మహదహంకారంబు మానియుండుటయు
గృహదారసుతులందు నిచ్చలేకునికి
అహితరాత్మత్వ భావాత్మకం బగుచు
దనయు నాసక్తి విస్తారంబులేమి
మొనసి ప్రియాప్రియంబులు గల్గునపుడు
ననయంబు సమబుద్ధి సమరియుండుటయు

వాసుదేవేతర ప్రాప్తవ్యసుగతి
వీసరలేదను విశదయోగమున
నాయందె విడువునొందని భక్తికలిమి
పాయక విజన నివాసమందునికి
జనసంగసంప్రీతి చాలించుకొనుట
అనిశ మాత్మజ్ఞానమందు నిత్యతయు
పొనరు మోక్షజ్ఞానమున లాభదృష్టి
అనుచు నీపూర్వోక్తమగు సర్వవిధము
జ్ఞానంబనంబడు జను దీనికన్య
మైనది యజ్ఞానమని చెప్పబడును
జ్ఞేయమేదో యది చెప్పెదన్వినుము
ధీయుత దేనిని దెలిసి మోక్షంబు
నొందునో యాదిలేకుత్కృష్టమగుచు
మ్రిందుటలేని యాబ్రహ్మంబు దలప
సత్తునుగాక యసత్తునుగాక
యెత్తఱినుండు నదేయనంబడును
పరికించిచూడ నాబ్రహ్మమంతటను
కరములు పాదముల్గలిగి యుండునది
అంతట శీర్షాక్షు లాస్యముల్గలది
అంతట శ్రుతులతో నమరుచునుండి
అంతట జగమందు వ్యాపించియుండు

ఎంతయు నాబ్రహ్మ మింద్రియావళుల
వ్యాపారములచేత నడరుదానివలె
జూపట్టినను నక్షు శూన్యమైనదియు
దేనినినంటక దేజరిల్లినను
తానె సర్వంబును ధరియించునదియు
గుణములు లేనిదై కొరలుచుండినను
గుణముల భోక్తమై కొమరొప్పునదియు
ప్రాణుల బహిరంతరంబులయందు
ఆనిర్మలబ్రహ్మ మచరరూపముగ
చరరూపముగను సూక్ష్మంబౌటవలన
నరిగ నెఱుంగ నశక్యమైనదిగ
అణుమరానిదిగ బాయకయుండు నొద్ద
వఱలు బ్రహ్మం బనవచ్ఛిన్నమయ్యు
ప్రాణుల యందఱియం దవచ్ఛిన్న
మైనదానివలె నిత్యంబుగానుండు
ప్రాణులనెల్లను భరియించు నదియు
పుట్టి గ్రసించుచున్ బుట్టించునదియు
అల పరబ్రహ్మమేయని యెఱుంగనగు
అలఘు ప్లవంగమాధ్యక్ష కేతనుడ
ఆపరబ్రహ్మ మర్కాది తేజముల
కోపి ప్రకాశకం బూర్ధ్వమైనదియు

# ౧౭౦ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగము.

అజ్ఞానమునకంటె వ్యతిరిక్తమగుచు
సుజ్ఞానరూపమై సుజ్ఞేయమగుచు
జ్ఞానగోచరమునై సర్వచేతనుల
మానసంబందున నలయుచుండునది
యని చెప్పబడుచుండునది ధనంజయుఁడ
వినుమిట్లు క్షేత్రమవ్విధిఁ జ్ఞానమును
జ్ఞేయమున్నీకు సంక్షేపంబుగాను
ఈవెడ నుక్తమయ్యెను పాండుతనయ
నాభక్తుఁడీచొప్పున నెఱింగి నాదు
నాభావమునకు దిన్నగ నర్హుఁడగును
తనరుచునుండు క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁ
డను నిద్దరి ననాదులనుచు నీవెఱుగు
పాదిగుణంబులు బుద్ధి ముఖవికారములు
పరికింపు ప్రకృతి సంభవములుగాఁగ
తొలుత మేనికి సుఖదుఃఖాదికములు
గలిగింప బ్రకృతియే కారణంబగును
పురుషుండు సుఖదుఃఖములను భోగింప
పరగు కారణమని పల్కంగబడును
ప్రకృతియందుండినవాఁడు పూరుషుఁడు
ప్రకృతి సంభవ గుణావళికి భోక్తయగు
గురుసుఖదుఃఖాదిగుణముల సక్తి

పురుషునికిం బుణ్య పాపాన్యయోని
జననంబునకును బీజంబుగా నుండు
అనఘ కార్యకరణ వ్యాపారములకు
నరయంగ సాక్షిగా నను మోదకుడుగ
భరియించువాడుగ ఫలభోక్తగాను
నిరవగ్రహుడుగ మేని నియామకుడుగ
పరమాత్మగా జెప్పబడు పూరుషుండు
ఇరవుగ నుత్కృష్టుడీ దేహమందు
పరగుచునుండును పొందును మార
సకల వికారాళి సహితప్రకృతిని
ప్రకృతియందున్న క్షేత్రజ్ఞునిగూడ
ఎవడీవ్విధంబున నెఱుగునోవాడు
వివిధవిధంబుల విహరించుచున్న
భువియందు వెండియుం బుట్టడర్జునుడ
పరివిమలంబగు స్వీయభావంబునందు
ధ్యానంబుచేత గొందఱు బుద్ధియందు
మానసవృత్తినిం బరమాత్మ నెపుడు
గనుచుంద్రు సాంఖ్యయోగమున గొందఱును
ఘనతరనిష్కామ కర్మయోగమున
కొందఱాత్మను గనుంగొనుచుంద్రు విజయ
కొందరయ్యాత్మ నీకీలది నెఱుంగ

## ౧౭౨ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగము.

బాలక స్వేతరాచార్యులవలన
నాలించి శ్రద్ధ్యాన మాచరించెదరు
పరమవేదాంత శ్రవణపరులైన
పురుషులందఱు మృత్యువును దాటుచుంద్రు
పావన భారతాన్వయ వీరవర్య
స్థావరజంగమాత్మక మల్పతరము
నా వస్తు వేమాత్రమైనను భూమి
నావిర్భవించునో యావస్తువెల్ల
ప్రకృతి పూరుషుల సంపర్కంబువలన
నొకట గల్గినదని యూహించి తెలియు
ఎవడు సర్వప్రాణి బృందంబునందు
నివసించి యొకరీతి నెగడు నీశ్వరుని
అవినశించుచునున్న నవినాశిగాగ
తవిలి గన్గొనునో యాత డెగనువాడు
అమర సర్వప్రాణులం దెందువలన
సమముగానున్న యీశ్వరు జూచువాడు
తనచేత బరమాత్మ ధ్వస్తుండుగాక
ఒనరెడి నందుచే నుత్కృష్టమైన
మోక్షంబునొక్కట పొందుచున్నాడు
ఏక్షణంబున తత్వదృష్టితో నెనసి
ఎవడు కర్మములు నావృతమాయచేత

ఈవిధ వైఖరులగా నిరూపగాబడును
అని మెప్పుగాంచునో యెప్పుడువాడు
అతిశయంబు క్షేత్రజ్ఞు ననుపాధికునిగ
గనుచునుండును జుమీ కపికేతనుండ
వినుము భూతములకు భిన్నభావమును
ఒకదానియందునే యున్నదానిగను
ప్రకటంబుగా నెప్డు పరికింపగలడో
ఆయాత్మచే నెప్పుడఖిలజగంబు
జాయమానమని నిచ్చలు జూడగలడో
అప్పుడు బ్రహ్మమునొందు నాత్మవిదుండు
నిపుణుండ మొదలు లేనిది యాటవలన
ఏగుణంబును లేక యెసగుటవలన
ఓగుగ నాశన మొందకయుండు
నీపరమాత్మ ప్రాకృత దేహమందు
దీపించుచుండినన్ దివిరికర్మమును
చేయక ఫలముతో జేరకయుండు
ఏయనవున నభంబెల్ల వస్తువుల
వ్యాపించియుండియు నతిసూక్ష్మమగుట
నేపదార్థము నంటకెసగునో యట్లు
గాత్రమందంతట గడునిండియుండి
క్షేత్రజ్ఞుడంటడు శ్వేతవాహనుడ

పరిత నొక సూర్యుఁడెల్లలోకమును
జేరిప్రకాశింప జేయుచున్నాఁడో
ఆరీతి క్షేత్రజ్ఞుఁ డఖిలదేహమును
చేరిప్రకాశింప జేయుచున్నాఁడు
ప్రకృతి పూరుషయోగ వాస్తవాంతరము
ప్రకృతి భూతమ్ముల పటుమోక్షగతియు
ఎవరు యోధిగ జ్ఞానదృష్టిచేమిగల
వివరంబుగ నెఱింగి వెలయుచుండెదరో
వారు పరబ్రహ్మ భావంబునొంది
శేరుదురని శౌరి క్రీడీకింజెప్పె
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
సరయు శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర
కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
సుమహిత ప్రకృతియంచు పురుషుడంచు
దనరు క్షేత్రంబు క్షేత్రజ్ఞ నిద్దఱిని
ఘనత విభాగింప గలుగు యోగంబు
అనునిది పదియు మూడవ తరంగంబు

దనర నీకిది యర్పితంబౌను గాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల





శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

గుణత్రయవిభాగయోగము.

# చతుర్దశ తరంగము.

శ్రీవధూరమణ యాశ్రితభక్తశరణ
కైవల్యనయన వేంకటభూభృదయన
కరుణ నాకర్ణింప గదవె నామనవి
హరిధనంజయునికిట్లని మెరసెన్ను
జ్ఞానంబులందు శ్రేష్ఠంబు నుత్కృష్ట
మైన జ్ఞానంబు నెయ్యముతోడ మరల
వినుము చెప్పెద నీకు విస్పష్టముగను
మునులందఱీజ్ఞానము నెఱింగి మున్ను
దీనికంటెను మహోత్కృష్టమైనట్టి
మానితసిద్ధి సంప్రాప్తించి మనిరి
తనరు నీజ్ఞానసాధన మాశ్రయించి
ఘన మత్స్వరూపంబు గనినవారలయి
సృష్టివేళను జనియింపకయుండుఁ
నష్టివేళను నాశనము నొందకుండుఁ
ఖ్యాతశూరుడ మదీయ పరాప్రకృతి

భూతసృష్టికి హేతుభూతమై యుండు
దానియందే నిల్పెదను గర్భమేను
దానివలన ప్రాణితతి బుట్టుచుండు
ఎల్లయోనులయందు నేమూర్తులన్ని
ఉల్లసింపగ బుట్టుచుండునో జగతి
అల్లవానికి తల్లియగు మహాప్రకృతి
అల్లననందు గర్భాధానకర్త
అయిన నేవానికి యయ్యనై యుండు
భయవిధాయిని భగవన్మాయవలన
ఘనము జనించిన సత్వము రజస్సు తమము
నని మూడిగుణము లవ్యయుడైనయట్టి
క్షేత్రజ్ఞునిన్ స్వశక్తిని బల్మిబట్టి
గాత్రంబునం దణికట్టువానివలె
భాసిల్లుచుండు స్వభావంబువలన
ఆసను నేడముగ నాచరించుకొని
అనుసరించును గాన నణికట్టుచున్న
దని చెప్పబడియెనో యర్జునా వినుమా
ధృతిశాలి యాగుణత్రితయంబులోన
నతినిర్మలంబౌట నవలిసంబైన
స్ఫటిక మాణిక్యంబు పగిది దీధితుల
పటిమచేత బ్రకాశపరచుటవలన

౧౭౮ గుణత్రయ విభాగ యోగము.

అనుపద్రవ ప్రదంబగు సత్వగుణము
ఒనరిన సౌఖ్యసంయోగంబు చేత
అంతఃకరణ ధర్మహర్షంబు చేత
అంతట దేహిని నటికట్టుచుండు
ప్రాప్తింపనిది కోరబడు చునికి వలన
ప్రాప్తవస్తువున లోభము కల్మి వలన
మొనయు రజోగుణంబును రాగశీల
మనుగా నెఱుంగుము పూరుషులీన
ఆరజోగుణము కర్మాసక్తి చేత
ఆరయ దేహిని నటికట్టుచుండు
ప్రాణికోటులకు మోహక తమోగుణము
జ్ఞానంబులేమిని జనియించుననియు
అరసి యెఱుంగుమీ యాతమోగుణము
నెరి ప్రమాదాలస్య నిద్రల చేత
అమరిన దేహిని నటికట్టుచుండు
సమకూర్చు సుఖమున సత్వగుణంబు
శ్రుతికర్మమందు గూర్చు రజోగుణంబు
అతులిత జ్ఞానంబు నావరించుచును
పొరదిన్మ అపున గూర్చు దమోగుణంబు
సురుచి రజస్తమస్సుల నిరసించి
సరగ సత్వగుణంబు సంజాతమగును

పొరలు రజస్సత్త్వముల నిరసించి
కొలది మీరెడు తమోగుణ ముద్భవించు
పొలుచు తమస్సత్త్వముల నిరసించి
నలువుగాను రజోగుణము సంభవించు
ఎలమిని నాలింపు మింకను విజయ
తనయ భోగములకు స్థానకంబైన
తనువున శ్రుతి ముఖ ద్వారంబులందు
జ్ఞానస్వరూప ప్రకాశమేతఱిని
పూనికనుదయించి పొదలు నాతఱిని
అమిత సుఖాది చిహ్నంబులవలన
విమల సత్త్వగుణాభివృద్ధిగా నెఱుగు
అరిది రజోగుణం బభివృద్ధమైన
పరధనాదుల కాంక్ష బహుళాభిలాష
సామాన్యచేష్టయు శమము లేమియును
క్షేమార్థక క్రియల్ సేయఁబూనుటయు
ఇట్టి చిహ్నము లుదయించుచునుండు
బిట్టు వివేకంబు ప్రిదిలిపోవుటయు
స్వావధానము లేమి యప్రవృత్తియును
ఏవగించెడి మోహ మిలక్షణములు
అక్షతి తమోగుణం బభివృద్ధిమైన
కలుగుచు నుండును కపికేతనుండ

౧౪౦ గుణత్రయ విభాగ యోగము.

విరియ సత్వగుణాభివృద్ధి కాలమున
మరణంబునొందిన మానవోత్తముడు
ఉత్తమ బ్రహ్మజ్ఞులొందుచున్నట్టి
ఉత్తరలోకంబు నొందుచున్నాడు
వెలయ రజోగుణ వృద్ధియైనతఱి
ప్రలయంబుగాంచిన ప్రాణికి-కర్మ
కలిత మానవులందు గలుగుజన్మంబు
తెలియ దమోగుణో ద్రేక కాలమున
మృతినిబొందిన దేహి కష్టంబుగాక
యతినింద్యమగు సూకరాది యోనులను
జననంబుగలుగు నిశ్చయ మర్జునుండ
వినయధురంధరా వినుము వెండియును
పరమసాత్త్విక గుణోద్భవ కర్మమునకు
పరికింపు సత్వభవ్యము నిర్మలంబు
ఐనఫలంబగు నండ్రుకోవిదులు
పూనిక రాజసంబున జేసినట్టి
క్రియకు దుఃఖఫలంబు కీర్తించుచుండ్రు
జయహీనమగు తామసక్రియకెప్పుడు
అవివేకమే ఫలంబగు నండ్రువిజయ
ప్రవిమల సత్వంబువలన జ్ఞానంబు
పొడము రజోగుణంబున లోభమొదవు

కడు తమోగుణమున ఘటియించు మఱవు
మోహమజ్ఞానంబు మొనయుచునుండు
ఊహింప సాత్త్వికులూర్ధ్వలోకముల
మానక రాజసుల్ మర్త్యలోకమున
హీనవృత్త్యావృతి నెపుడు తామసులు
అవివేకులగుచు బశ్వాది యోనులను
భవమొందుచున్నారు పార్థుండవినుము
ఏ గుణంబులకంటె నితరము నెపుడు
బాగుగ నెఱిగిన వాడు కర్తనుగ
గనడో యిదియును గాక గుణాళికంటె
అనిశంబు తనువున వ్యతిరిక్తుడగుచు
చను గుణవ్యాపార సాక్షి భూతునిని
గనునో యప్పుడు వాడు గంతవ్యమైన
నాదు స్వరూపమొందగలండు విజయ
ఈ దేహజంబైన యీ గుణత్రయము
బొరయకుల్లంఘించి పురుషుండు జన్మ
మరణ జరావ్యథావండలి చేత
ముక్తుడై మోక్షంబు పొందుచున్నాడు
వ్యక్తంబుగా వినుమనిన పార్థుండు
ఏచిహ్నములచేత నీగుణత్రయము
త్రోచిన వాడని తోచునాతండు

# ౧౪-౨ గుణత్రయ విభాగ యోగము.

ఎట్టి యాచార సంస్పృకుడైయుండు
ఎట్టులీగుణముల నెడబాయగలడు
అని ప్రచ్ఛ చేసిన హరియిట్టులనియె
అనఘుండవిను త్రిగుణా తీతుడెవ్వడు
ప్రాప్తమైనట్టి సత్వగుణ కార్యమును
ప్రాప్తతమోగుణోద్భవ కార్యమైన
మోహమున్ ద్వేషింపబోడు పార్థుండ
ఆహః నివృత్తంబులైన సత్వాది
కార్యంబులను గూడ గాంక్షింపబోడు
ఆర్యతవహించుంచి యచల భావమున
పక్షపాతము లేనివానికైవడిని
వీక్షించుచును నత్యుపేక్షాభియుక్తి
నలరి యెవండు గుణావళిచేత
చలియింప బడడో నిచ్చలు గుణావళులు
సొలసివర్తించునంచు వసించునెవడో
తొలగ డెవ్వడో సుఖదుఃఖంబులందు
సముడును నాత్మవిచార శీలుడును
సమముగ లోష్టము స్వర్ణమున్ శిలయు
అయినవాడు ప్రియాప్రియంబులనెడి
ద్వయమందు సమబుద్ధి వఱలెడువాడు
మానావమాన సమానుండు వృద్ధి

హాని నిందాస్తుతులందు తుల్యుండు
సర్వకార్యారంభ సంపరిత్యాగి
హర్విన మిత్రారి పక్షంబులందు
సముడును ధీరుండు జగతి నెవ్వాడొ
అమలుడౌ వాని గుణాతీతుడందు
పరఁ నిశ్చలమైన భక్తియోగమున
స్థిరత నెవ్వడు నన్ను సేవించువాడు
భువినీగుణత్రయంబు నతిక్రమించి
అవితథంబైన బ్రహ్మత్వంబునొందు
వినుపరమాత్మకు విగ్రహాకృతిని
పనివడితో నశింపని మోక్షమునకు
ఆధారమేను నిత్యంబైన యట్టి
సాధుధర్మమున కాశ్రయమును నేను
అలఘుముఖ్య సుఖాశ్రయంబేనటంచు
తెలియుమీవని శౌరి తెలిపె పార్థునకు
అని ధృతరాష్ట్రున కాసంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిజశ్రీర సుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షుమిత్ర శ్రీవత్సనగోత్ర
కన దింద్రకంటి వేంకటశాస్త్రికృతము

౧౮౪ గుణత్రయ విభాగ యోగము.

రమ హరిసూక్తి తరంగిణి యందు
ప్రముఖత్రైగుణ్య విభాగ యోగంబు
అనునిది పదునాలుగవ తరంగంబు
దనర నీకిది యర్పితం బానుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.



§§§§§§§§§§§§§§§§§§§§§§§§§§§§

శ్రీ ర స్తు.

హరిసూక్తి తరంగిణి.

పురుషోత్తమ ప్రాప్తి యోగము.

పంచదశ తరంగము.

—:o:—

శ్రీరమ్యచరణ యాశ్రితలోక శరణ
వీరారి హరణ శ్రీవేంకటరమణ
అవధరింపుము గరుణావలోకమున
శ్రవణోత్సుకుని సవ్యసాచినిఁ జూచి
భవ విమోచనరీతి వనజ లోచనుఁడు
స్వవచనంబుల నిట్లు ప్రవచింపఁదొడఁగె
మహినఁ దేజరిలు బ్రహ్మంబు మూలమయి
మహదహంకార నామక శాఖలమరి
క్షణిక విధ్వంసియౌ సంసారవృక్ష
మణుమాత్రము నశింపదని పల్కుచుండ్రు
వేదంబు లాకులై వెలయు నశ్వత్థరువు
పాదెఱింగినవాఁడు వర వేదవిదుఁడు
పరగు నత్సంసార పాదపంబునకు
నరయ నవ్యక్తాదులను శాఖలెల్ల

౧౮౬ గుణత్రయ విభాగ యోగము.

సారదిగా గుణముల స్థూలీభవించి
వరరవస్పర్శ రూపరస వాసనలు
అను చిగుళ్ళొందినవై క్రిందమీదఁ
జెనసి సాంద్రముగ విస్తృతములై యుండు
దనరఁ దత్సంసార ధరణీజమునకు
పొనర రాగద్వేషములను మూలములు
లలిత ధర్మాధర్మ లక్షణంబులయి
పొలుచు కర్మఫలంబు ముందుగాఁగలవి
యగుచు మానవ లోకమందు నెల్లెడల
నాగని క్రిందను మీదనుండె వ్యాపించి
ఒఱగు నీవృక్షమందుండిన ప్రాణి
లెఱుఁగ రీసంసార వృక్షరూపంబు
ఆరీతి దీని యాద్యంత సంస్థితులు
నేరరు దెలియంగ సకలమార్జుచుడ
క్షను దృఢమూల మీసంసారతరువు
నమల విరక్తి శాతాయుధంబూని
వడిఁదున్మి పిదప నేపదమొంది జనులు
పుడమికి మరల నెప్డును బుట్టరారు
సరవి ననాది సంసారప్రవృత్తి
సరణి యెవ్వనినుండి సాగెనోయతఁడు
ఆద్యుండు పురుషుండు నానందఘనుఁడు

విద్యాశ్రీయుండునై వెలయునాపతికి
ఏను బ్రపన్నుండ నిపుడొందుననుచు
నానిక తత్పదంబరయంగ వలయు
మానమోహముల సంపర్కంబులేక
జ్ఞానవిద్యాసక్తిఁ జరియించుచుండి
సంగదోషంబుల జాడనుబోక
త్రుంగించినట్టి కోర్కెలనెల్లఁ గలిగి
సొలసి శీతోష్ణాది సుఖదుఃఖసంజ్ఞ
గల ద్వంద్వములకు జిక్కక యుండువారు
అయిన యాత్మజ్ఞాను లవ్యయంబైన
భయహీన తన్ముక్తి పదమొందుచుండ్రు
జ్వలనేందురవులైనఁ బరమ తత్పదము
వెలిగింపనోప రేవిధమునసైన
తివిరి యేపదమొంది తిరుగరో జనులు
ప్రవచింపఁ బరమ మప్పదమె మత్పదము
అరయు మనాదియా నస్మదంశంబె
చిర సంసర్గమందు జీవరూపమయి
మానసాన్వితములై మాయయందున్న
జ్ఞానేంద్రియముల నాకర్షించుచుండు
ఏమేనెపుడు జీవుఁడెసయుచున్నాఁడో
హామేనెపుడు వాసి నేగుచున్నాఁడో

౧౮౮ పురుషోత్తమప్రాప్తి యోగము.

అప్పుడు విరులు మున్నగు చోటనుండి
తప్పక వాయువు తావులపోలిక
ఈయింద్రియములం గ్రహించి యేగిన
పాయక జీవుండు త్వక్చక్షువులను
రసనంబు శ్రోత్రంబు ఘ్రాణంబుమనసు
వెసనధిష్ఠించి తద్విషయంబులెల్ల
అనుభవించుచునుండు ననురక్తితోడ
వినుము పాండవ యవివేకమానవులు
ఒడలినుండక పాయుచున్న వానిగను
ఉడుగక దేహమందున్న వానిగను
ఫలములు భుజియించు వానిగాం ద్రిగుణ
కలితునిగా జీవుం గానంగలేరు
జ్ఞానాక్షిగలవారు గానంగ జాలుదురు
పూనియత్నంబొనర్పుచు యోగివరులు
ఈయాత్మ నాత్మయందె కనంగ వానిగను
బాయకీక్షింతురు వట్టిగోజ్ఞులగు
నవివేకులు గనంగ యత్నించుచుండెనం
దవిని యంతరాత్మను దర్శింపలేరు
ఏతేజమినుండెల్లలోకముల
ఖ్యాతిగ భాసిల్లంగాం జేయుచుండు
శీతాంశు వహ్నుల యందు నాతేజ

మా తేజము నెఱుంగు మస్మదీయమని
ధరణి నావేశించి తగబన్ని నేను
ధరియించుచుండు భూతముల నర్జునుఁడ
రసమయుండైన చంద్రముఁడ నేనగుచు
పొసగ నోషధులెల్లఁ బోషింపుచుండు
ఈహ నేనుదరవహ్నిస్వరూపమున
దేహధారులమెల్ల దేహముల్చొచ్చి
తలయు ప్రాణాపాన వాయుసంసక్తి
నల భక్ష్యభోజ్య చోష్యలేహ్యము లను
అలఘు చతుర్విధాహార వస్తువుల
బలు తెఱంగల నేనుఁ బచియింపుచుండు
ఎల్ల శరీరుల హృదయ పద్మమునఁ
బెల్లుగ నేనుఁ బ్రవేశించియుండు
గాన నావలననే జ్ఞానంబు స్మృతియు
వాని విస్మృతియును బ్రభవించుచుండు
వేదాంతకర్తను వేదార్థవిదుఁడ
వేదంబులన్నింట వేద్యుండ నేను
క్షరుఁడను పేర నక్షరుఁడను పేర
పురుషులిద్దరు భువనమందుండ్రు
ఇరువురిలో క్షరుండెల్ల భూతములు
పొసఁగ నక్షరుండు జీవుండనంబడును

గాన నీయుద్ధరికంటె భిన్నుండు
నై నెరి నుత్కృష్టుడైన పూరుషుఁడు
అనిశ మొప్పును బరమాత్మయాతండె
అనుచుఁ జెప్పంబడు నార్యాళిచేత
ఎవ్వఁడీలోకత్రియిం బ్రవేశించి
నివ్వటిల్లభరించి నెగడుచునుండు
ఆపరమాత్మమే యవ్యయుండైన
శ్రీపరబ్రహ్మవాచిగ నొప్పుచుండు
క్షరుడైన పురుషు వీఁకనతిక్రమించి
పొరినక్షరుండైన పురుషునికంటె
ఏకారణమున నుత్కృష్టుండనైతి
ఆకారణంబున నామ్నాయమందు
స్థిరత లోకమునం బ్రసిద్ధుండనైన
పురుషోత్తముడనయి పొలుపొందుచుండు
ఓయర్జునుండ యీయుర్వి నెవ్వాఁడు
ఏమెడనైన మోహితుఁడు గాకుండి
పోలంగఁ బురుషోత్తముడనైన నన్ను
ఈలాగున నెఱింగి మెసఁగునాతండు
సర్వభావముచేత సర్వజ్ఞుఁడగుచు
పూర్వోక్తఘనునన్నుఁ బొందుచున్నాఁడు
ఘోరపాపవిదూర కుంతీకుమార

ఈరీతినతిగుహ్య మీశాస్త్రమెల్ల
నాచేత నుక్తమైనది దీని నెఱిఁగి
ఏచిబుద్ధియుతుండు కృత కృత్యుఁడగును
అనుచు నీరీతి కంసారియాశౌరి
అనఘుడు పార్థునకానతి యొసఁగ
అని ధృతరాష్ట్రున కా సంజయుండు
వినిపించె నీరీతి వివరంబుగాను
ధరనిది త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
కనదింద్రకంటి వేంకట శాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
క్రమ పురుషోత్తమ ప్రాప్తియోగంబు
అనునిది పదియు నైదవ తరంగంబు
దనర నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితా నీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.





శ్రీ ర స్తు.

## హరిసూక్తి తరంగిణి.

## దైవాసుర సంపద్విభాగ యోగము.

### షోడశ తరంగము.

శ్రీరమానుతనామ రిపుకాద్విరామ
కారుణ్యసీమ వేంకటశైలధామ
వీనుల కింపుగా వినుము నామనవి
ఆనీలవర్ణుడిట్లనియె ఫాల్గునకు
జ్ఞానయోగమునందు సంతతంబునికి
దానంబు చాపలత్వంబు లేమియును
అంతరింద్రియ నిగ్రహము భీతిలేమి
స్వాంతంబుపరిశుద్ధి యజ్ఞంబు తపము
ఎల్లప్రాణులయందు కృప గల్గుటయును
తెల్లంబుగ బహిరింద్రియ నిగ్రహంబు
నియమంబు దప్పక నిగమాధ్యయనము
ప్రియముతోఁగూడు సూనృతభాషణంబు
సాంద్రమౌవిషయాఘ సన్నిధియందు
ఇంద్రియంబులకు స్వీకృతిలేక యునికి

చెనటితనములేమి చిత్తోపశమము
తనయందు బరమాత్మతత్వచింతనము
బయిటను లోపల పరిశుద్ధిగనుట
స్మయములేకుండుట సైచియుండుటయు
హారి నకార్యకరణమ్ములయందుసిగ్గు
పరులకు హానిసల్పమిదలంపమియు
ప్రతిభతోనుంట మార్దవ మార్జవంబు
వితరణంబును కిన్కవిడుపు ధైర్యంబు
అనబడు నివిదైవతైశ్వర్యయుక్తి
జననమొందిన యట్టి జనునకుంగల్గు
గరువంబుక్రోధంబు కపట మజ్ఞతయు
పరుషత్వ మతిమానిభావంబు నివియు
అసురసంబంధ దుష్టైశ్వర్యయుక్తి
వసుధ జన్మించిన వానికింగలుగు
దేవసంబంధమై తేజులు సంపత్తి
భావింప సంసార బంధముక్తికగు
అసురసంబంధమై యడరుసంపత్తి
పొసగును సంసార ఘాతబద్ధతకు
దేవసంబంధసందీప్త సంపదను
నీవుబుట్టితివి చింతింప కర్జునుడ

## ౧౬ దైవాసురసంపద్విభాగయోగము.

పురుషవరిష్ఠ యీభూలోకమందు
సరవిగ దేవతా సంబంధమనియు
అసుర సంబంధంబు నని భూతసృష్టి
ఎసగుచునుండును నిరుదెఱంగులను
ఆ తెఱంగుల రెంటియందును దైవ
భూతసృష్టి విశేషముగ జెప్పబడెను
ఇపుడు నాసురభూతసృష్టి చెప్పెదను
విపులతరశ్రద్ధ వినుము నాపలుకు
శర్మేతరాసురోచ్చ నిసర్గయుతులు
ధర్మప్రవృత్తిని ధర్మనివృత్తి
నెఱుగరు వారలయెడ శుచిత్వమును
నెఱయునాచారంబు నిజము జొప్పడదు
జగము లేనిదని యాశ్రయము లేనిదని
తగు నియామకుడు తద్దయు లేనిదనియు
వారలు నిత్యము వచియించుచుందురు
ధీరుండ యిది గాక స్త్రీపురుషులకు
బలవదన్యోన్యసంబంధంబువలన
కలుగనిదేమిటి గలదు వేరొకటి
ఎల్లలోకము కామహేతువుగానె
తెల్లంబుగా నైనదియని పలుకుదురు
దుష్టులీజ్ఞానమ్ము మొత్తుగ స్వీకరించి

నష్టాత్ములగుచు మందమనీషులగుచు
హింసాదిక క్రూరకృత్యముల్సలిగి
సంసారబద్ధులై శత్రువులగుచు
భువనక్షయము నొనర్ప బుట్టుచున్నారు
తవిలినిందింపగా దరము గానట్టి
కోరిక గైకొని ఘోరమోహమున
దూరీకృతన్యాయ దుర్ధానములను
గొనుచు నశాస్త్రీయ కునియమంబూని
ఘనదంభ మదమానకలితులై యుందు
మరణంబు వరకును బరిమితిలేని
దుస్తర చింతాసమేతులయి కామముల
ననుభవం బుత్కృష్టమనెడు వారలయి
కనగ నింతియెయని కడునిశ్చితులయి
స్వరుచి రాశాపాశ శతబద్ధులగుచు
తరళ కామక్రోధ తత్పరులగుచు
కామోపభోగంబుకై యధర్మమున
కామింతురర్థ సంగ్రహము సంతతము
నాచేత నిపుడు బొందబడె నీధనము
ఏచిపొంకెదనిక నీమనోరథము
నాకున్నయది యీధనంబు బూర్ణముగ
నాకు వెండియు నీధనంబు రాగలదు

ఈవైరినాచేత నిపుడు ద్రుంపబడె
భావించియిక నన్యవైరుల ద్రుంతు
నేను బలిష్ఠుడ నేభోగయుతుడ
నేను సౌఖ్యయుతుండ నేను ప్రభుండ
నేను సంపన్నుండ నేను సత్కులుడ
నేనర్థవంతుడ నేను దక్షుడను
ఒరు డెవ్వడు సమానుడున్నాడు నాకు
హరుసమునొందెద యజియింతు నిడుదు
అనియిట్టులజ్ఞత నతిమోహితులయి
అనిశంబు మోహజాలాక్రాంతులగుచు
బహువిధ కామానుభవ సక్తులగుచు
అహితదుర్గతికి వారరుగుచున్నారు
తమసన్నుతికి దామె దలకొనువారు
వినతులై పెద్దల పీడించువారు
ధనమాన మదసముద్ధతులైన వారు
అనభిజ్ఞులైన వారభిధాన మాత్ర
మఖములచేత దంభముచేత శాస్త్ర
ముఖసూక్తి విపరీతముగ యజించెదరు
బలమహంకార దర్పముల కామమును
అలము క్రోధంబును నాశ్రయించుచును
స్వాన్యదేహంబుల యందలినన్ను

మాన్యుని ద్వేషించు మతి సమేతులయి
పరుల మేల్ సైపనోపక యుందు రెవరో
భరితవైరులు క్రౌర్యపరు లమంగళులు
అయి మెలంగుచునున్న యన్నరాధముల
భయద సంసృతులందు ప్రకట భూర్యసుర
యోనులయం దెప్పుడునుచుచున్నాను
మానక యవివేక మానవాధములు
ప్రతిజన్మమం దాసురమగు గర్భమున
ప్రతిపన్నులై నాదు ప్రాపు జెందక యె
తదనంతరము నీచతరగతిం గాంత్రు
మొదట కామము క్రోధమును లోభమనెడు
ఈరీతి త్రివిధమానివియె దుర్గతికి
ద్వారమైయుండె నాత్మకు నాశకరము
గావున నీమూటిఁ గడుఁద్యజింపనగు
త్రైవిధ్యమైన యేతాదృశత్రివిధ
నిరయ మార్గములచే నిర్ముక్తనరుడు
స్థిరముగ దనకు మేల్ సేయుచున్నాఁడు
కౌంతేయ పిదప మోక్షగతి జెందెడిని
సంతతంబు యథేచ్ఛ జరియించునెవడు
పొనర సిద్ధినివాఁడు పొందనోపండు
గనలేడు సుఖము మోక్షమునొందబోడు

౧౬వ దైవాసురసంపద్విభాగయోగము.

అలఘుడ కాన కార్యాకార్యములను
సలుపుచో నీకు శాస్త్రము జ్ఞానమునకు
సాధనంబగుగాన శాస్త్రోక్తమైన
సాధుకర్మ మెఱింగి సలుపనీకిపుడు
అనుగుణంబై యుండు నర్జునావినుము
అనుచు క్రీడికి నిట్లు హరి యెఱింగించె -
అని ధృతరాష్ట్రున కా సంజయుండు
వినిపించెనీరీతి వివరంబుగాను
ధరనివి త్రిపురసుందరి కటాక్షమున
నరయ శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్ససగోత్ర
కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
అమరిన సదసద్గుణౌఘంబెఱుంగ
సొంపుగ దైవతాసుర సాధ్వసాధు
సంపద్విభాగంబు సలుపుయోగంబు
అనునిది పదియారవ తరంగంబు
దనర నీకిది యర్పితంబౌను గాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల

§§§§§§§§§§§§§§§§§§§§§§§§§

శ్రీరస్తు.

---

# హరిసూక్తి తరంగిణి.

---

## శ్రద్ధాత్రయవిభాగయోగము.

---

## సప్తదశ తరంగము.

—:0:

శ్రీమంజూదరహాస హృతజగత్త్రాస
కామనిరాస వేంకటశైలవాస
అవధరింపుము దానవారికంతటను
దివిజేంద్రతనయుఁ డిట్లనుచుఁ బలికె
హరి కృష్ణ యెవరు శాస్త్రవిచారముఁడిగి
సరసవృద్ధాచార సంప్రదాయమును
అనుసరించి సమంజసాస్తిక్యబుద్ధి
నెరసి పూజింతురో యెడబాయకుండ
వారల నిష్ఠ యెబ్భంగినైనదియొ
నీరజాత దళాక్ష నిఖిలైకరక్ష
సాత్త్వికమా రాజసంబ తామసమ
తత్త్వంబు దెలుపుమీ దయతోడ ననిన
హరి యిట్లు వచియించె నర్జునుం గాంచి

సరిగ దేహులకు సంస్కారంబువలన
జనియించు నా శ్రద్ధ సాత్వికంబనియు
దనర రాజసమని తామసంబనియు
త్రివిధముల్ గలదిన్నె దీపించుచుండు
వివరింతు నా శ్రద్ధ వినుము పార్థుండ
క్షితిని ప్రాణులకు స్వీశిష్ట సంస్కార
యుతమైన బుద్ధికి యోగ్యమా శ్రద్ధ
సగును కావున యీజీవుడరయ
పొసగిన యాస్తిక్య బుద్ధియుక్తుడగు
అవని నే పూరుషుండాస్తిక్యబుద్ధి
దవులు నాపురుషుండు తచ్ఛ్రద్ధనొందు
బుజుత సాత్వికులె యర్పింత్రు దేవతల
యజియింత్రు రాజసుల్ యక్షరాక్షసుల
ప్రీతి దామసజనుల్ వెసగొందరైన
ప్రేతలభూత మాతృకల బూజింత్రు
కపటంబుతో నహంకారంబు తోడ
అపరిమితేచ్ఛతో ననురక్తితోడ
బలముతో నున్న మెవ్వారు తపంబు
ఎలమిమీరగ దపియించు చున్నారో
అవివేకులెవరు దేహమునందు నెపుడు
తవులు నింద్రియముల తద్ధర్మసాక్షి

భావునినను గృశింపంగ జేసెదరో
ఆవిధమగువారి నసురనిశ్చయము
గలవారిగ నెఱుంగు కపివరధ్వజుడ
అలఘుదేహులకెల్ల నాహారమెన్న
త్రివిధంబులుగ మనః ప్రియముగానుండు
అవని నట్లనేయుండు యజ్ఞంబుదపము
దానంబు త్రివిధ భేదమ్ముగనుండు
దానిని వినిపింతు దగనాలకింపు
సరసముల్ మృదులముల్ చమురుగల్గినవి
చిరకాలమును గూర్చి చెడకుండునవియు
ఆయురారోగ్య సౌఖ్యబల సత్వముల
కాయమందభివృద్ధిగా జేయునవియు
అయిన యాహారం బలతిసాత్వికులకు
ప్రియములైయుండును విజయుండవినుము
కడుచేదు పులుసుప్పు కారంబువేడి
పడసినవియు కోద్రవంబు లావాలు
మొదలగునాహారములు రాజసులకు
ముదమొనర్చునవి సుమ్ము ధనంజయుండ
ఏభోజనంబు జామేగి చల్లనయి
శోభిల్లనిది రసశూన్యమైనదియు
విశతదుర్గంధ సంభృతమైనయదియు

## ౧౦౨ శ్రద్ధాత్రయవిభాగ యోగము.

గతదినంబున వండి కడవనింపినది
భుక్తావశిష్టం బపూతమైనదని
ప్రోక్తమునేదో యాభోజనంబెన్న
తామస గుణులకెంతయు ప్రియంబగును
సామీరిసహజ వేసరక యాలింపు
విడువక శాస్త్రోక్త విధిచేతజూడ
బడిన యేయజ్ఞంబు ఫలకాంక్షలేక
యజియింపదగినదేయని మానసమును
ఋజుభావమున జాల దృఢముజేసికొని
సలుపంగబడునో యాసరణి యజ్ఞంబు
పలుకంగబడును సత్త్వగుణముఖ్యమని
ఏయజ్ఞము ఫలంబు నిచ్ఛయించుకొని
పాయక స్వమహిమ ప్రకటనార్థంబు
యజియింపబడునో యాయజ్ఞంబుగాంచి
సుజన రాజసమటంచు నెఱుంగు మీవు
ఎన్నంగ శాస్త్రవిహితము గానిదియు
అన్నదానము లేనియదియు మంత్రంబు
లేనిది దక్షిణ లేనిది శ్రద్ధ
లేనిది నమ్మిక లేనిదినైన
యజ్ఞంబు తామసంబని వచించెదరు
ప్రాజ్ఞుల గురుల నిర్జరుల విప్రులను

పూజించుట శుచిత్వమును నార్జవంబు
రాజాస్యలం దనురాగంబు లేమి
పరికేని నొకింత హింస సేయమియు
శారీర తపమని జగతి చెప్పబడు
భయదంబుగానిది బాధింపనిదియు
ప్రియమును హితమునై వెలయుసత్యోక్తి
శ్రుతి చయంబభ్యసించుట వేదా యదినెం
మతి మంతులండ్రు వాఙ్మయ తపంబనుచు
మనసున నిర్మలాత్మ్యము దెల్పువృత్తి
మనసును గెల్చుట మౌనభావంబు
మానస శుద్ధియున్ మానసతపము
గా నుడువంబడు గాండీవధన్వి
ఫలకాంక్షలే కనపాయ యోగంబు
గలమానవులచేత ఘనతరంబైన
ఆస్తిక్యమున తప్తమైనట్టి త్రివిధ
శస్త్ర తపంబెన్న సాత్వికంబండ్రు
తనుబహుమానింప దన్నుబూజింప
తనుసత్కరింపగ దంభంబుచేత
నొనరగ నేతపం బొనరింపబడునో
వినశించునదియు నుర్విని చంచలతను
• చనున తపంబు రాజసమనంబడును

అనభిజ్ఞతా నిశ్చయముచేత దేహ
పీడచే పరనాశ విషయమేతపము
వీడకకృతమొ తద్విధమైన తపము
తామసంబనబడు తత్త్వవిధిజ్ఞ
ఏ మేని ప్రేమతో నీదగునంచు
యోగ్యదేశమునందు యోగ్యకాలమున
యోగ్యునియందు ప్రత్యుపకారిగాని
వాని కేదాన మీబడునో యబ్బంగి
దానము చెప్పంగదగు సాత్త్వికమని
కృత్యఫలంబొందు నిచ్ఛతోనైన
ప్రత్యుపకారంబు వాంఛించియైన
ఖేదంబు తననుదకిందోచునట్లు
ఏదానమొరునకు నీయంగబడునో
ఆదాన మతిరాజసాత్మకంబండ్రు
ఏదానమొగి నిమ్నహీ నికృష్టదేశ
కాలములందు తసర్హ మూర్ఖులకును
మాలి మసత్కృత మవమానితమయి
తామిడు తద్దాన తతి తామసంబు
ఓమని తత్తనియును సత్తటంచు
ఈమూడు విధముల నెసగు బ్రహ్మంబు
నామధేయోచ్చారణము చెప్పబడెను

దానిచే ద్విజులు వేదములు యజ్ఞములు
పూనికచేమున్ను బుట్టింపబడియె
కానసచ్ఛాస్త్ర సూక్తములైనయజ్ఞ
దానతపఃక్రియల్ తప్పకెప్పుడును
ప్రామాణిక బ్రహ్మవాదులచేత
ఓమని యాదియం దుచ్చరింపబడి
వరుస నారంభింప బడుచునున్నయవి
చిర ముముక్షుజనంబుచేత తత్తనెడి
పరమాత్మ నామంబు ప్రవచింపబడును
వరతపోయజ్ఞముల్ పలువిధంబులగు
దానక్రియల్ ఫలాదానేచ్ఛలేక
మానక యాచరింపంబడు పార్థ
ఉత్తమంబనుటయం దున్నదనుటను
సత్తను శబ్ద ముచ్చారితంబగును
సాధుకర్మమునందు సత్పదంబెపుడు
సాధుజనాళిచే సమ్యగుక్తమగు
పొలుపైన యజ్ఞ తపోదానములను
కలనిష్ఠసత్తని గణియింపబడును
భగవదర్థీయమై పరగుకర్మమును
ప్రగుణాత సత్తనీ పలుకంగబడును
ఏది యశ్రద్ధ మెయిన్ వేల్వబడునొ

## ౨౦౬ శ్రద్ధాత్రయవిభాగయోగము.

ఏదితప్తంబౌనొ యేదియీబడునొ
అది సమస్తం బసత్తని చెప్పబడును
అదిగాన ఫలియింపదచట నిచ్చటను
అనుచు పార్థున కిట్లుయదువల్లభుండు
అనుకంప దీపింప నానతియొసగె
అనిధృతరాష్ట్రున కాసంజయుండు
వి[illegible]కీర్తి వివరంబుగాను
ధ[illegible]ని త్రిపుర సుందరి కటాక్షమున
న[illegible]యు శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సస గోత్ర
కనదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమ హరిసూక్తి తరంగిణియందు
ప్రమితి శ్రద్ధాత్రయ భాగయోగంబు
అనునిది పదునేడవతరంగంబు
దనర నీకిది యర్పితంబౌనుగాత
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకశైలపాల.



శ్రీరస్తు.

## హరిసూక్తి తరంగిణి.

### మోక్ష సన్న్యాస యోగము.

### అష్టాదశ తరంగము.

శ్రీవేంకటాఖ్య ధాత్రీధర గేహ
జీమూత ప్రభాంచిత నీలదేహ
అవధారు ఫల్గునుం డచ్యుతుం గాంచి
సవినయంబుగ నిట్లు సయ్యనంబలికె
జాగేల గోపాల సన్న్యాసమనగ
త్యాగం బనంగను తాత్పర్యమేదో
వినియాథార్థ్యంబు వేఱువేఱుగను
నేనెఱుంగగ దెల్పనిన్ గోరెదను
అనుడు జనార్దనుండర్జునుంజూచి
అసమ నికరణం దయాలోకమమర
కామ్యకర్మంబులు గావింపకునికి
సౌమ్యుఁడ కోవిదుల్ సన్న్యాసమండ్రు
సకలకర్మఫలానుషక్తి లేకునికి
ప్రకటితప్రాజ్ఞులారసి త్యాగమండ్రు

బుధులు కొందఱుకర్మను సదోషమగుట
విధిలేమిచేదాని విడుపుమేలందు
దాన యజ్ఞతపః ప్రధాన కర్మంబు
మానుట తగదని మరికొంద ఱందు
త్యాగంబు మూడువిధంబులుగలది
గాగ నేహేతువుగా జెప్పబడెనో
ఈనీవు పార్థ ఆయీత్యాగమందు
నానిశ్చయంబు పూర్ణమ్ముగా వినుము
భువియజ్ఞదాన తపోరూపమైన
ప్రవరకర్మంబేది యమరుచుండెడినో
ఆకర్మమొనరింపనగు మానదగదు
ఓకపిధ్వజుడ నీవొనర నాలింపు
యజ్ఞంబు దానంబు నకలంకతపము
ప్రాజ్ఞులకుం బవిత్రంబులై పరగు
మనుకొని విజయ యీపూర్వోక్తమైన
ఘనకర్మములను సంగము ఫలంబులను
త్యజియించి చేయంగదగునని యిట్లు
నిజముగ నాచేత నిశ్చయింపబడి
యుండిన నాయొక్క యుత్కృష్టమతము
గాండీవివిను నిత్యకర్మంబుసల్ప
మానంగగూడదు మరితెల్విలేక

అనిత్యకర్మ సంత్యాగంబు గరము
తామసంబనబడు తథ్యంబు పార్థ
పిమ్మానవుడు మేనికిడుమవాటిల్లు
నను భీతినేకర్మ మతికష్టమనుచు
ఒనరింప నుడుగునో యుర్వినాతండు
అక్షీణ రాజసత్యాగంబొనర్చి
మోక్షఫలంబును బొందడు పార్థ
ఆసక్తిని ఫలంబుద్యజియించి శ్రద్ధ
నేసన్నియతకర్మమే శేయవలయు
ననిచేయబడునో యాత్యాగంబుసత్వ
మునబుట్టినదని బొల్పుగ సమ్మతంబు
గురుతర సాత్విక గుణముతోగూడి
పరిచితాత్మజ్ఞాన పరిపాటిగల్గి
అపగత సందేహుడై కర్మఫలము
నెప్పుడు విసర్జించి రహిసగుపూరుషుడు
కరముమేలొసగని కామ్యకర్మమును
నిరసింపడెన్నడు నెరిమేలొసంగు
కుశలకర్మమునందు గూడికంగనడు
అశుభదంబైన దేహాభిమానంబు
గలవానిచే నెల్లకర్మంబునుడుగ
నలవిగాదదిగాన నవనినెవ్వాడు

కృతకర్మఫల ముజ్జగించుచున్నాడో
యతడె కర్మత్యాగియని చెప్పబడును
ఇష్టంబుగానిది యిష్టమైనదియు
ఇష్టమనిష్టంబు నైన యా మిశ్రమును
అను మూడువిధంబులగు కర్మఫలము
ఒనరవిసర్జింపకున్నవారలకు
జననాంతరమునందు సైతముంగలుగు
మును మానువారికెప్పుడు గల్గబోదు
సకలకర్మంబుల సంసిద్ధికొరకు
ప్రకటితసాంఖ్యశాస్త్రమునందు మరియు
అవితథంబైన సిద్ధాంతమ్మునందు
ప్రవచింపబడిన యీపంచహేతువుల
తెలియుము నీవు మదీయోక్తివలన
కలితదేహము నహంకారంబు మరియు
శ్రవణాదికరణవ్రజంబు నవ్వలను
వివిధరూపంబుగ వేర్వేరనున్న
ప్రాణాసిలాపాన వాతాదివృత్తి
దానును సూర్యాధిదైవంబునైదు
జనుడువాక్కున మానసమున కాయమున
ననిశమేకర్మంబు న్యాయమైనదియు
న్యాయనుగాసిది యైనందొడంగి

సేయునో దానికిచెప్పంగబడిన
నైదును హేతువులమర నర్జునుడ
ఆదట కారణం బాకర్మ సంధు
ఇట్లుండగా దన్నె యెవడు కర్తనుగ
ఘటియించుకొని యెప్డు గాంచుచున్నాడో
వాడు దుర్మతి గలవాడయి బుద్ధి
పాటవ నాత్మతత్వంబునుగనడు
ఏనని యెడి భావ మేపూరుషునికి
గానరాదో యెవని కమనీయబుద్ధి
అనులిప్తముంగాదో యాతడీజనుల
పెనగి చంపియును జంపినవాడుకాడు
బద్ధుండుమంగాడు పార్థుండ వినుము
ఉద్ధూత పాపకర్మోపదేశంబు
జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయుననియు
గానంగ త్రివిధముల్ గలదియైయుండు
కర్మసంగ్రహమెన్న గరణంబటంచు
కర్మంబటంచును కర్తయటంచు
కనుమూడువిధములు గలదియైయుండు
వనచర ప్రవర భాస్వర కేతనుండ
జానుగ కపిలాది శాస్త్రంబునందు
జ్ఞానంబు కర్మంబు కర్తయున్ మరల

జననుత సత్వ రజస్తమంబులను
గొనముల భేదంబుకొలది ముత్రైగల
దనర జెప్పబడు తద్జ్ఞానాదికముల
విను శాస్త్రరీతి జెప్పెదనర్జునుండ
సన్నుతమైన యేజ్ఞానంబుచేత
భిన్నములై యున్న వివిధభూతముల
అవిభక్తమై యవ్యయంబైనదగుచు
అవిరతంబొకభంగి నలరుచునున్న
పరమాత్మ సుస్వరూపంబును మిగుల
పరికించుచుండు నాపగిదిజ్ఞానంబు
సాత్వికంబని చెప్ప జనుసవ్యసాచి
సత్వశుద్ధిగని యేజ్ఞానంబుచేత
వివిధభూతములందు భేదభావమున
వివిధవైఖరులచే వెలయువానిగను
వివిధరూపములచే వెల్గువానిగను
తివిరియశ్రాంతంబు తెలియుచున్నాడొ
అజ్ఞానమెఱుగు మీవతిరాజసమని
ఏజ్ఞానమొకటి యయిన ప్రతిమాది
యాకృతియందున్నదై సర్వవిషయ
మైకనంబడుదాని యట్లున్నయదియు
హేతువులేనిదై హీనఫలంబు

నేతరినిదునది బుతము గానియది
అయిన యాజ్ఞాన మవ్యక్త తామసము
అయినదనంబడు నర్జునావినుము
నిహిత మేకర్మము నిత్యమైసంగ
రహితమై ఫలసక్తి రహితునిచేత
పొలుచు రాగద్వేషములు లేమివలన
సలుపగా బడునో యాసాధుకర్మంబు
సముదాహృతంబగు సాత్వికంబనుచు
క్రమముగ గోరెడు లగన కామిచేత
మహదహంకార సంపన్నతతోడ
బహుతరాయాస సంప్రాప్తమౌనట్టి
యేకర్మమెలమితో కృతమగుచుండు
నాకర్మమనబడు నతిరాజసమని
ముందుగల్గెడి కార్యమును నాశనమును
పొందుటహింసయు పురుషకారమును
అమర విచారింప కజ్ఞానముననె
రమణ నేకర్మ మారంభింపబడునో
ఆకర్మమీరితంబగు తామసమని
ఏకూటమియు నహంకృతియు వర్జించి
ధైర్యముత్సాహంబు దాఁగొనియుండి
కార్యసిద్ధియసిద్ధికాలమునందు

అవికృతిగను కర్తయగును సాత్వికుడు
భువిరాగియైకర్మముల ఫలంబెల్ల
గనగోర్కిదార్కొని కడుసొమ్ముగోరి
చెనకి యన్యులను హింసించుశీలంబు
గలిగి యాచారంబు గావింపమాని
యలఘు సంతోష శోకాన్వితుండైన
కర్త రాజసుడని ఖ్యాతిని జెందు
పూర్తిగ మానసంబు జయింప లేక
మతిలేనివాడయి మాయావి యగుచు
ఇతరుల నిరసించు నిచ్చతో గూడి
ఆలస్యముగ పనులాచరించుచును
చాలమందుండు విషాదిస్తబ్ధుండు
నగుకర్త తామసుండని చెప్ప బడును
తగ వేరుగను సమస్తంబుకర్తమైన
గురుతర సత్వాది గుణములవలన
వరుస మువ్విధములం బరగుచునున్న
ధృతి బుద్ధి భేదంబు నింక నాలింపు
ప్రతిభతో కర్మమార్గము యొక్కవిధము.
కమనీయమోక్షమార్గము యొక్కవిధము
అమలిన మలిన కార్యా కార్యములను
భయమును నభయంబు బంధముక్తులను

ప్రీతిమునునే బుద్ధి వేర్వేర నెఱుగు
అదియె సాత్విక బుద్ధియని చెప్పబడును
చెదరినయేబుద్ధిచేత ధర్మమును
అటులధర్మముచేయు నధర్మకార్యమును
పటిమతో చేయ నొప్పని యకార్యమును
ఇవియ యథార్థత నెఱుగుచున్నాడో
భువినది రాజసబుద్ధి నాబడును
బహుతమస్సున గప్పబడిన యేబుద్ధి
మహిమచే దూష్యధర్మంబును కరము
ఉచితధర్మంబుగ యోగ్యధర్మమును
అచిరానుచితధర్మమైన దానిగను
కలపదార్థము నెల్ల కడువిరుద్ధముగ
తలచుచుండునోయది తామసబుద్ధి
అతులయోగముచేత నచలమౌనెట్టి
ధృతిచే మనః ప్రాణధీంద్రియ క్రియలు
ధెలమిదాల్పబడు నాధృతిసాత్వికంబు
ఫలముగోరునరుండు పటుసక్తిచేత
అరయ ధర్మార్థ కామాదులేధృతిని
ధరియించునాధృతి దగురాజసమన
చెనటి బుద్ధిగలట్టి చెడుగట్టిధైర్య
మున నిద్ర భయశోకముల మత్తతయును

విగుబు వీడండా యాధృతి తామసంబు
ప్రగుణ మేసౌఖ్యానుభవమందు మిగుల
ఆడంబరమగు నభ్యాసంబువలన
క్రీడించుచున్నాడా క్లేశనాశనము
పొందుచుండునో యట్టి ముప్విధంబులగు
అందరిజనులచే ననుభవింపబడు
సుఖమునీకిప్పుడు సారదిదెల్పెదను
నిఖిలంబునాలింపు నీవర్జునుండ
ఆదిని విషము చాయను నంతమందు
స్వాదైన యమృతంబు భంగినేసుఖము
అగుచున్నదో స్వకీయంబైన బుద్ధి
సుగుణ ప్రసన్నత జూపట్టుసుఖము
సాత్త్వికం బనబడంజను సవ్యసాచి
తత్త్వజ్ఞ శతమన్యుతనుజాత వినుము
అమరిన విషయేంద్రియముల సంగమున
సుముఖితగలుగు నేసుఖమాదియందు
అమృతతుల్యము నంతమందువిషంబు
సమమగునో యట్టి సౌఖ్యంబుదలప
రాజసంబనబడు ప్రాజ్ఞులచేత
వ్యాజయుక్తంబయి యనుభవవేళ
అంతమందాత్మ మోహకరమేసుఖము

సంతతనిద్రాలసత్వప్రమాద
జాతమైనట్టి యాసౌఖ్యమెన్నగను
ఖ్యాతమౌ తామసంబని పాండుతనయ
దివియందునుండిన దివ్యులందైన
భువియందుగల మానవులయందునైన
ఈప్రాకృతగుణ త్రయీముక్తమైన
యేప్రాణి సముదయంబేనియు లేదు
వసుధ బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులకు
పొసగకర్మంబులు మును మాయవలన
గూడినసత్వాది గుణములచేత
వీడకక్రమముగా విభజింపబడియె
అంతరింద్రియ నిగ్రహము శుచిత్వంబు
అంతట బాహ్యేంద్రియౌఘ నిగ్రహము
జ్ఞానంబు ననుభవజ్ఞానంబు నోర్పు
ధ్యానమాస్తిక్యంబు తపమునార్జవము
ప్రకృతి జన్యంబైన బ్రాహ్మ్యకర్మంబు
సకలజనంబుల సంరక్షణంబు
ధైర్యంబు దాక్ష్యంబు దానంబుమిగుల
శౌర్యంబు తేజంబు సంగ్రామమందు
పారిపోకుండుట ప్రకృతిజన్యమయి
గౌరవంబైనట్టి క్షాత్రకర్మంబు

భూమినిదున్నుట గోరక్షణంబు
వాణిజ్యమును స్వభావంబునఁగల్గు
వైశ్యకర్మంబని భాషింపఁబడును
వశ్యమైనట్టి సేవారూపమైన
పనిశూద్రునకు స్వభావజముగానుండు
మనుజుండు తనతన మహితకర్మమున
నిరతుఁడై సంసిద్ధిఁ జెందుచుండు
సహజాత్మ కర్మమునన్ సక్తుఁడగుచు
ఏకరణిన్ సిద్ధిఁ జెందుచున్నాఁడో
ఆకర్మవిధ[illegible] నాలింపు విజయ
ఏమహేశ్వరునుండి యెల్లభూతముల
భ[illegible]తోత్పత్తి ప్రాపించుచుండెడినో
ఏ[illegible]మునిచేత నీసర్వజగము
[illegible]క వ్యాపింపఁబడెనో మానవుఁడు
[illegible] సత్కర్మంబుచేత నెవ్వనిను
ఆరాధనఁ గొలిచి మోక్షంబునొందుచుండు
విగత గుణంబైన స్వీయధర్మమున
తగనెన్నకృత పరధర్మంబుకంటె
శ్రేష్ఠమౌను స్వభావనిర్దిష్టకర్మమును
నిష్ఠచేయుచుండిన మానవుండు
దోషంబు నొందఁడెందును పాండునందనయి

దోషయుక్తంబయి దూష్యమైయున్న
సహజకర్మమువిడ సాధ్యంబుగాదు
నిహితములై యున్న నిఖిలకర్మములు
పొగచేతననలంబు పోలె దోషమున
నొగిగప్పబడియుండు నో యర్జునుండ
సర్వంబునందు నసంసక్తబుద్ధి
బర్వుచు నిర్జింపబడిన చిత్తమున
ఆశలువర్జించి యాత్మీయకర్మ
రాశిఫలంబు సర్వంబును విడిచి
పరమనైష్కర్మ్య పావనసిద్ధినొందు
పరగసిద్ధిని గన్నవాడు బ్రహ్మమును
బొందెడి రీతిగా నుత్కృష్టమైన
బంధురజ్ఞాన సంబంధమౌనిష్ఠ
సంక్షేపముగ నావచశ్శైలి నెరుగు
కాంక్షించి మాయావికారంబులేని
బుద్ధితోయుక్తుడై భూరిధైర్యమున
శుద్ధతగను మనస్సును నిగ్రహించి
వేగంబ శబ్దాది విషయముల్విడిచి
రాగద్వేష భారంబువర్జించి
విజనస్థలంబును వెదకి కూర్చుండి
విజితమనోవాక్యవిగ్రహుండగుచు

అల్పభోజనుడయి ధ్యానయోగమున
బాల్పొంది వైరాగ్యమును నాశ్రయించి
నేను విరాగిననెడి నహంకృతిని
పూనిన సామర్థ్యమును యోగవశత
నెసగునున్మార్గ ప్రవృత్తిలక్షణము
పొసగన దర్పంబు భూరికామమును
చూపట్టు బాహ్యవస్తు పరిగ్రహంబు
కోపంబు విడిచి పోగొట్టంగబడిన
హర్షశ్రమాదుల నలరుచున్న మత
సర్వ పశుమాత్రమేన్ సంసక్తిగనక
బ్రహ్మసమ్యగ్జ్ఞాన పరమనిష్ఠుండు
బ్రహ్మభావంబును బడయుచున్నాడు
చతురత బ్రహ్మనిష్ఠను గన్నవాడు
సతతంబు నతులితాచ్ఛ మనసుఁడగుచు
నష్టవస్తువునకెన్నడు దుఃఖపడదు
తుష్టిగరానివస్తువు గోరబోదు
సరిచూపు ప్రాణిసంచయమందుగలిగి
పరమమహాభక్తి బడయుచున్నాడు
ఎంతటివాడనో ఎవడనో నన్ను
ఎంతయు భక్తిమెయిన్ యథార్థముగ
ననునెఱింగెడిని నంతేను యథార్థముగ

నను నెఱింగినమీద నను బ్రవేశించు
ఎపుడు ప్రాప్యస్థాన మేనమైయుండి
నిపుణత జేయుచు నిఖిలకర్మముల
నాయనుగ్రహముచే నాశంబులేక
యేయెడస్థిరమయి యెసగుచున్నట్టి
పరమపదంబునుం బడయుచున్నాఁడు
పురుషర్షభ వివేక బుద్ధిచేనీవు
అఖిలకర్మములు నాయంద యర్పించి
సఖుడ నేనుత్కృష్ట సాధనుండవయి
గరిమతో బుద్ధియోగము నాశ్రయించి
కరము నాయెడ మదిగలవాడవగుము
నాయందె యెపుడు మానసముంచునీవు
నాయనుగ్రహమున న్సకలదుఃఖముల
తరియింపగలవిక తర్వాతనీవు
గరువంబువలన వాక్యము నాది వినక
పోతివేని నశించిపోదు వర్జునుడ
ఆతతాహంకార మది యాశ్రయించి
ఊని యుద్ధమ్ము మాన యోచింతువేని
ఈనీదు నిశ్చయంబెల్ల మిథ్యయగు
నీస్వభావమె నిన్ను నియమింపగలదు
స్వస్వభావముచేత జాతమైనట్టి

స్వీయమౌ కర్మంబుచేత కట్టబడి
ఏయెడ నేవేళ నేకర్మమీవు
చేయఁగా వలదని వాంఛింపకుండెదవో
ఓయజ్ఞునుండ యోయుత్కృష్టచర్య
ఆకర్మ మజ్ఞత నవశుండవగుచు
చేకొని తప్పక చేయంగఁగలవు
అనవశేష జగన్నియామకప్రభువు
అనపాయుఁడై యెల్ల ప్రాణులయొక్క
హృదయప్రదేశమందె శరీరముల
చెదరకయుండిన జీవులనెల్ల
నిజశక్తినిపుణతం ద్రిప్పుచునుండు
విజయుండ సాధువివేకంబు గల్గి
పాయక సర్వాత్మభావంబుచేత
ఆయీశ్వరుని శరణార్థివి గమ్ము
ఆయీశ్వరానుగ్రహమున నుత్కృష్ట
మై యొప్పు చిత్తశుద్ధ్యాప్తి వెల్గెదవు
స్థిరమైన పదమునుం జేరియుండెదవు
కురువీర యీతెఱంగున నీకు నిపుడు
కానగోప్యముకంటె కడుగోప్యమైన
జ్ఞానంబు నాచేత సరవి జెప్పబడె
ఈజ్ఞానశాస్త్రంబు నెల్ల తెల్లముగ

ప్రిజ్ఞ నాలోచించి రహిని నేసరణి
తలచుచు నున్నావా తత్ప్రకారంబు
సలుపుము మరిచాల సర్వగోప్యంబు
ఘనమైన నాదు వాక్యంబాలకింపు
అనిశంబు నాకు ముఖ్యముగ నిష్టుడవు
ఐతివి నీవనునది యేది కలదా
బ్రితినా హేతువువలన నీకోరకు
హితమును జెప్పెద నిపుడు ఫల్గునుడ
వ్రితముగ మనసు నాపయి పాదుకొల్పి
ఎడపకయుండ నాయెడభక్తి గలిగి
వడిసనుబూజించు వాడవుగమ్ము
కోరిసంప్రీతినాకు నమస్కరింపు
ఆరీతి చేసితివేని నిక్కముగ
నను జెందగలవిక నాకు మిత్రుడవు
గనుక నీకు ప్రతిజ్ఞ గావింతు నిజము
మగుడక సర్వకర్మముల వర్జించి
జగతి ముఖ్యుని నన్ను శరణార్థివగుము
తడయక సకల బంధంబులనుండి
విడిపింతునిన్ను బల్విడి దుఃఖపడకు
వార్త వైఖరి జ్ఞానవర్తనిం దెలియ
కీర్తింపబడెన యోగితాశయంబు

అడరం దపము లేని యతనికింభక్తి
విడిచినవానికిన్ వినసివానికిని
అకటనాయెడ నసూయపడువానికిని
ఒకయప్పుడేనియు నుపదేశముడుగు
ఒసర నెవ్వడు గోప్య ముత్కృష్టమగుచు
దనరు నీగీతాభిధాన శాస్త్రంబు
తెలివి గల్గుటకై మదీయభక్తులకు
దెలుపునో వా డస్మదీయమైనట్టి
పరమభక్తినిజేసి బడయునునన్నె
నరులందు వానికన్న నొకండు నాకు
ప్రియముజేసెడివాడు పృథివిలో లేడు
ప్రియతముండును భావివేళయందైన
వానికంటె పరుండు వసుధ కాఁబోడు
మానుగ నెవడు ధర్మసమేతమైన
మనల యీసంవాద మానితంబైన
పనితసద్గ్రంథంబు పఠియింపగలడో
ఆజనుచే జ్ఞానయజ్ఞంబుచేత
పూజితుడను నాదు భువిలోన నేను
అనిమది నానిశ్చయంబర్జునుండ
జను డెవ్వడతులిత శ్రద్ధతోఁగూడి
అనసూయుడై యిమ్మహాగ్రంథమెల్ల

వినునా వాడును సర్వ వృజినముక్తుడయి
పుణ్య కర్మ మొనర్చు పురుషులు పొందు
పుణ్యలోకంబుల పొందుచున్నాడు
ఇట్టట్టు గదలని యేకాగ్రమతిని
ఇట్టి గీతాశాస్త్రమెల్ల నీచేత
వినబడె యెంగదా విజయుడా నీదు
అనుపమాజ్ఞత మూలమైన మోహంబు
మ్మనుముట్టగళితమై పోయెనా యేమి
అనుడు శ్రీకృష్ణుని కర్జునుండనియె
జలజనాభ భవత్ప్రసాదంబువలన
అలమిన యవివేక మంతయుపోయె
తెలివిఘటించె సందియమెల్ల దీరె
తెలిసి నీవాక్యంబు తెఱగుచేసెదను
అనుచు క్రీడి మురారి కనియెనిబ్భంగి
అని ధృతరాష్ట్రున కా సంజయుండు
వినిపించిమరియు నివ్విధమునంబలికె
అనఘుండ యీరీతి హరిధనంజయుల
పులకాంకురోత్పత్తి మూలమద్భుతము
సలలితంబగు నిట్టి సంవాదమేను
వాసిగవింటి పావనతనుగంటి
వ్యాస ప్రసాదంబు వలన ననంగ

శ్రీగలదివ్యదృష్టి ప్రాప్తివలన
యోగాభిధానంబు నుత్కృష్టమైన
ఈరహస్యము తానె యీశ్వరుండగుచు
ఈరీతిబలుక యోగేశ్వరుండైన
వాసుదేవునినుండి ప్రత్యక్షముగను
దోసముల్ దొలగ ముందుగ నేనువింటి
జనపాలవర మహైశ్చర్య దాయకము
అనఘమైనట్టి కృష్ణార్జునులకును
జరిగిన యీదృశ సంవాదమెల్ల
స్మరియించి స్మరియించి మాటిమాటికిని
ఎలమిబొందుచునుంటి ధృతరాష్ట్రభూప
అలఘుతరాశ్చర్యమైన శ్రీకృష్ణ
వరవిశ్వరూపంబు భావంబునందు
స్మరియించి స్మరియించి మరియు లెస్సగను
ధ్యానించి ధ్యానించి అధికవిస్మయము
మానసంబునగంటి మాటమాటకెని
పులకాంకురంబులు బొడముచున్నయవి
అలఘు యోగేశ్వరుండైన కృష్ణుండు
ఏపక్షమందున నెసగుచుండెడినొ
ఏపక్షమందు మహేష్వాసధరుడు
అర్జునుండుండునో ఆపక్షమందు

ఊర్జితసంపత్తి ఉరువిజయంబు
చిరతరైశ్వర్యంబు స్థిరమైననీతి
బరగు నందును నాడు పరమనిశ్చయము
అనుచుగీతాశాస్త్రమా సంజయుండు
వినిపించె ధృతరాష్ట్రవిభునకికరణి
[illegible] త్రిపురసుందరి కటాక్షమున
వరయ శ్రీసూర్యనారాయణపుత్ర
వనజాక్షమిత్ర శ్రీవత్సగోత్ర
కనిదింద్రకంటి వేంకటశాస్త్రికృతము
రమహరిసూక్తి తరంగిణియందు
అమరెడు మోక్షసన్యాసయోగంబు
అనునిది పదునెన్మిదవ తరంగంబు
దనర నీకిది యర్పితంబౌనుగాత
తరణిందు పంచభూతంబులు నెంత
వరకుండునో యంతవరకు నీకృతియు
స్థిరతనుండునుగాక క్షితిలోకమందు
పరమ కారుణ్యైక పావనశ్లోక
నిహతాహితానీక నిర్మలాలోక
గ్రహరాజతేజ వేంకటశైలపాల.

సంపూర్ణము.



